# శ్రీ అంగిరానామ సంవత్సర
# సిద్ధాన్త పంచాఙ్గము 1992-93















ప్రచురణ :




తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

శ్రీయైనమః

శ్రీ లక్ష్మీ వేంకటేశ్వరాభ్యాం నమః

# శ్రీ అంగిరానామ సంవత్సర

## సిద్ధాన్త పంచాఙ్గమ్

**1992-93**

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాన్తి,

శ్రీ తంగిరాల ప్రభాకర పూర్ణయ్య సిద్ధాంతిగారిచే విరచితము.

TIRUMALA TIRUPATI DEVASTHANAMS

తిరుమల తిరుపతి దేవస్థాన ఆస్థాన పణ్డితులు

అప్పికట్ల శ్రీమాన్ పణ్డిత వేదాన్తం దేశికాచార్యులవారిచే పరిష్కృతము

తిరుమల తిరుపతి దేవస్థానముల ఎగ్జిక్యూటివ్ ఆఫీసరువారగు

మహారాజశ్రీ ఎమ్.వి.ఎస్. ప్రసాదు, ఐ.ఏ.ఎస్., గారిచే ప్రకటింపఁబడినది.

తిరుపతి

1992

## శ్రీ వేంకటేశ భగవాన్



ఓమ్॥ మాత్పాదౌ శరణం వ్రజేతి చరణౌ సంసారసిన్ధుస్తదా।
జానుం సంస్పృశతీతి జానుమపి పాణిభ్యాం స్వయం దర్శయన్।
శేషాద్రౌ జగతోఽస్య రక్షణధియాఽతిష్ఠద్దయా సాగరః।
నశ్శ్రేయాంసి చతుర్భుజః కలయుతాం శ్రీ శ్రీనివాసః ప్రభుః॥

కీ.శే. శ్రీమాన్ పణ్డిత వేదాన్తం జగన్నాథాచార్యః
తిరుమల తిరుపతి దేవస్థాన ఆస్థాన విద్వాన్.

# శ్రీ అంగిరానామ సంవత్సర
# సిద్ధాన్త
# పంచాఙ్గ పీఠికా


పంచాంగకర్త:

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థానసిద్ధాంతి అగు

క్రీ|| శే|| దైవజ్ఞశేఖర బ్రహ్మశ్రీ తంగిరాల చినహనుమత్సిద్ధాంతిగారి కుమారుడు

శ్రీ ప్రభాకర పూర్ణయ్య సిద్ధాంతి

తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాంతి, ఫోన్ 64
(పూర్ణ జ్యోతిషాలయం)

రేలంగి - తణుకు తాలూకా,
పశ్చిమ గోదావరిజిల్లా (ఆంధ్ర)

## శ్రీ పద్మావతి దేవి



ఓమ్|| ఈశానాం జగతోఽస్య వేంకటపతేర్విష్ణోః పరాం ప్రేయసీం
తద్వక్షస్థల నిత్యవాసరసికాం తత్ క్షాంతిసంవర్ధినీమ్ |
పద్మాలంకృతపాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం |
వాత్సల్యాదిగుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్||

శ్రీరస్తు
శ్రీ లక్ష్మీ వేంకటేశః ప్రసన్నో భవతు
శ్రీ శ్రీనివాసాయ పరస్మై బ్రహ్మణే నమః

# పీఠికారంభః

ఓమ్|| శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ |
ప్రసన్న వదనం ధ్యాయేత్సర్వ విఘ్నోపశాంతయే ||
యస్యద్విరదవక్త్రాద్యాః పారిషద్యాఃపరశ్శతమ్ |
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ||
శ్రీమాన్ శ్రీశేషపృధ్వీ ధరశిఖరపరిస్పందిపాదారవింద-
ద్వంద్వో మందీకృతేందుద్యుతిరుచిరుచిరస్వాన్తనస్సంత నోతు |
లక్ష్మీం లక్ష్మీ వియోగాసహనిజహృదయఃకోఽపి కారుణ్యపూర్ణో
దేవాధీశఃప్రఫుల్లాంబుజదళనయనస్సర్వదా సర్వదో నః ||
కందర్పకోటి సదృశం కమనీయవేషం ముక్తావళీలలితకంఠ ముదారహారమ్ ||
పీతాంబరద్యుతి విరాజిత దివ్యదేహం శ్రీ వేంకటేశ వపురాత్మని సన్నిధత్తామ్ ||
మానాతీత ప్రథిత విభవాం మంగళం మంగళానాం
వక్షఃపీఠీం మధువిజయినో భూషయన్తీం స్వకాన్త్యా |
ప్రత్యక్షానుశ్రవిక మహిమ ప్రార్థినీనాం ప్రజానాం
శ్రేయోమూర్తిం శ్రియమశరణస్త్వాం శరణ్యాం ప్రపద్యే ||
శ్రీవిష్ణుచిత్తకుల నందనకల్పవల్లీం శ్రీరంగరాజహరిచందన యోగదృశ్యామ్ |
సాక్షాత్ క్షమాం కరుణయా కమలామివాన్యాం గోదామనన్యశరణశ్శరణం ప్రపద్యే ||
విశదోర్ధ్వపుండ్రవిలసన్ముఖాంబుజం లలితోపవీతకలితోరువక్షసమ్ |
కరపద్మవజ్రకలితత్రిదండకం కలయే యతీంద్రమహనీయవిగ్రహమ్ ||
ఆరోగ్యం పద్మబంధుర్వితరతు సతతం సంపదం శీతరోచిః |
భూలాభం భూమిపుత్రస్సకలగుణయుతాం వాగ్విభూతిం చ సౌమ్యః |
సౌభాగ్యం దేవమంత్రీ వితరతు సతతం భార్గవశ్శౌర్యమార్కిః |
ధైర్యం రాహుశ్చకీర్తిం సకలశుభ యుతాం కేతురిష్టార్థసిద్ధిమ్ ||
అబ్దాదౌ బంధుసంయుక్తో మంగళస్నానమాచరన్ | వస్త్రైరాభరణైర్దేహమలంకృత్య తతశ్శుచిః ||
శ్రీ వేంకటాచలాధీశం శ్రీనిధిం కరుణానిధిమ్ | నమస్కృత్యాప్యహిషకేశం యతిరాజం చ నిత్యశః ||
సంవత్సరఫలం సమ్యగ్యశ్శృణోత్యేకమానసః | దద్యుర్మనోరథం సర్వం దేవతాఃఫలముత్తమమ్ ||
జ్యోతిశ్శాస్త్రం మహాపుణ్యం ప్రమాణత్వేన నిశ్చితమ్ | చంద్రార్కౌ తత్రసాక్షిత్వం భజేతేనిశ్చలంయుతః ||
యథాశిఖామయూరాణాంనాగానాంమణయోయథా | తథా వేదాంగశాస్త్రాణాం జ్యోతిషం మూర్ధ్ని సంస్థితమ్ ||
శ్రీవత్స జన్మాఽఖిల సారతంత్ర సిద్ధాంత విజ్ఞానమతిర్ల నామాన్ |
శ్రీ తంగిరాలాన్వయజోఽహమార్యః శ్రీ శేషశైలేశ కృపావిశేషః ||
సోహం యథామతి మతాని విమృశ్య విద్వదాచారరీతిమవిలంఘ్య గురూపదేశమ్ |
శ్రీ వేంకటేశకృపయా వితనోమి సాంగం పంచాంగమత్ర విబుధాస్సదయా భవంతు ||

## గురువందనమ్

దైవజ్ఞ ప్రథమస్య పూర్ణ యశసశ్శ్రీబాలపూర్ణస్య యః
పుత్రశ్శ్రీ పిడపర్తి వంశజని సుబ్రహ్మణ్యశాస్త్రీ కృతీ ।
సూర్యార్యాది పురాతనాద్యతనసిద్ధాంతేషు గోలాదివి-
త్రిస్కంధాంబుధిపారగం మమ గురుం వందే సదాశ్రేయసే ॥

## దైవజ్ఞ ప్రశంసా, దైవజ్ఞ నివాసః

శ్రీ వేంకటేశా ప్పనృసింహతాట కేశాదిదేవై రభిరక్ష్యమాణమ్ ।
గోదావరీ పశ్చిమయోజనాంత శ్రీగోస్తనీతీర విరాజమానమ్ ॥
శ్రీవేదవేదాంగ విదుత్తమైర్బుధైః జ్యోతిర్విదగ్రేసర పండితైశ్చ ।
ఈడ్యైర్వదాన్యైరభిభూషితం చ చకాస్తి రేలంగిపురం సురమ్యమ్ ॥

యద్వంశే బహవశ్శ్రుతిస్మృతివిధా సజ్జ్యోతిషే పండితాః
శ్రీవత్సాభిధగోత్రజాస్తదనుమత్పైతామహోఽత్యంతధీః ।
శ్రీమత్పండిత సార్వభౌమ హనుమాన్వేదార్థవిత్సాత్విక-
సత్తత్కర్మనుకాలనిర్ణయకృతే పంచాంగకర్తా పురా ॥

తస్యాత్మజో వేంకటకృష్ణసోమయాజీసుసిద్ధాన్తవిదగ్రగణ్యః
శ్రీరామభక్తః ప్రతివత్సరం సత్పంచాంగమత్యంతముదాఽకరోచ్చ ॥
జ్యాయాన్ వేంకటహనుమాన్ ద్వితీయాకస్తు పూర్ణదైవజ్ఞః
తార్తీయోఽహం హనుమాన్ వేంకటకృష్ణాఖ్యదైవవిత్పుత్రాః ॥

చత్వారస్తనూజాః హనుమత్సిద్ధాంతినః తృతీయస్తేషు
ప్రభాకరపూర్ణశర్మాహం శ్రీనివాసకరుణాకాంక్షీ ।
అనూర్యం చ్యవనోంగిరోఽత్రిముఖరానభ్యర్చ్యన్యాన్మునీ
నాచార్యానపరాన్మయా సుమనసా శ్రీతాతపాదం గురుమ్ ।
పంచాంగం విరచయ్య వేంకటవిభోః పాదాబ్జయోరర్పితం
నశ్శ్రీయాంసి దయామయః కలయ తాం శ్రీ వేంకటేశః ప్రభుః ॥

**తిరుమల తిరుపతి దేవస్థానముల ఆస్థాన సిద్ధాంతి**

## అథ బ్రహ్మణః ఆయుః ప్రమాణాదికం

శ్రీమద్భగవద్దివ్యనాభికమల జాతస్య పరార్థద్వయజీవినః చతుర్ముఖస్య బ్రహ్మణః పరమాయుః వర్షశతమేవ | తత్ప్రమాణ సౌరాబ్దాః 31104000 కోట్లయః | ద్వితీయ పరార్థే ప్రథమవాసరే గతఘటికాదయః ఘ 17 విఘ 42 ప్రాణకాల (౦) గుర్వ క్షరోచ్చారకాలః 3 నిమేషః 19 లవత్రుటయః 3 సంప్రతి చతుర్థేత్రుటౌ గతసౌర మాసాదయః 2,14,27,32 ఇదానీం శ్వేతవ రాహకల్పే స్వాయంభువాద్యాః షణ్మనవో గతాః సప్తమే-వైవస్వత మన్వంతరే 27 మహాయుగాని గతాని. 28 మహాయుగములో వర్తమానము కలియుగము జరుగుచున్నది.

"యుగంభవేత్ వత్సర పంచకేన యుగాని తు ద్వాదశ వర్షషష్ట్యాం" అను ప్రమాణముచే ప్రభవాది 5 సం||రములు ఒక యుగము చొ||న (5 X 12=60) 12 యుగములగా నగుచున్నది. ఇట్లుగ కృష్ణయజుర్వేద తైత్తిరీయ బ్రాహ్మణము 10 ప్ర|| పాఠకము, 4వ అనువాకము చెప్పుచున్నది.

1 2 3 4 5

సంవత్సరోఽసి, పరివత్సరోఽసి, ఇదావత్సరోఽసి,ఇదువత్సరోఽసి,ఇద్వత్సరోఽసి,

|| ఇతి || ఇందులకు విద్యారణ్య భాష్యము.

ప్రభవాదిషు షష్టి సంవత్సరేషు ఏకైకస్మింశ్చక్రమేణ సంవత్సర పరివత్సరాది శబ్దాః వర్తన్తే...... ....... ........హే అగ్నేత్వం సంవత్సరోసి ప్రభవాది రూపోసి, పరివత్సరోసి--విభవ రూపోఽసి, ఇదావత్సరోసి—శుక్లరూపోసి, ఇదువత్సరోసి-ప్రమోదరూపోసి, ఇద్వత్సరోసి-ప్రజాపతిరూపోసి, పంచస్వేతేషు అనుగతాకారః వత్సరః ఏత్రద్రూపోసి.

ఏవమంగిరశ్శ్రీముఖ భావ యుగాదిషు ఏకాదశసు పంచకేషు యోజయితవ్యం,

అనగా, ప్రభవాది అయిదు సంవత్సరములు, "1 సంవత్సరము, 2 పరివత్సరము, 3 ఇదావత్సరము, 4 ఇదువత్సరము, 5 ఇద్వత్సరము" అను నామములు కలవై యున్నవి. ఇటులనే మిగతా ప్రతి అయిదు సంవత్సరములకు నామములను తెలియదగియున్నది. ఇప్పుడు బృహస్పతి దేవతాకమగు ద్వితీయ యుగమున (వర్తమానమున పంచవత్సరాత్మకమగు ద్వితీయ యుగమున) మొదటిది అగు ఊవహ్నిదేవతాక సంవత్సరనామముగల ఈ అంగిరా నామసం||రమున తిల దానము విశేషపుణ్యఫల ప్రదము.

దయా సముద్రుడగు శ్రీవేంకటేశప్రభువు అన్నియును శుభప్రదములుగను, సుఖప్రదములుగను ఉండునట్లు అనుగ్రహింతురుగాక.

# శ్రీ తిరుపతి (వేంకటాద్రి) నగర్యాః

విషువచ్ఛాయాంగుళాని 2-55 అక్షాంశాః + 13.44

భూమధ్యాత్ దేశాంతరకాలః ఘ|| 0-29 గం + 0-12వి||లు

అయనాంశాః భా 23-44.57

## స్ఫుటలగ్న ప్రమాణ, పుష్కరకాలాః

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేషస్య | 4-28 | = 3-3 | తులాయాః | 5-18 | = 4-14 |
| వృషభస్య | 5-4 | = 2-22 | వృశ్చికస్య | 5-31 | = 1-17 |
| మిథునస్య | 5-30 | = 4-24 | ధనుషః | 5-19 | = 3-43 |
| కర్కాటకస్య | 5-28 | = 1-16 | మకరస్య | 4-44 | = 2-13 |
| సింహస్య | 5-10 | = 3-38 | కుంభస్య | 4-14 | = 3-23 |
| కన్యాయాః | 5-6 | = 2-23 | మీనస్య | 4-8 | = 0-58 |

ఈ లగ్న ప్రమాణములు ఈ కాలమునకు తిరుపతికి చేయబడినవి. ఇవియే స్ఫుటలగ్న ప్రమాణములుగ గ్రహింపవలెను. తిరుపతి ప్రాంతంలోని అలవాటులో ఉన్న పాతలగ్న ప్రమాణములు ప్రాచీనకాలములో సాధించబడినందున పరిగ్రాహ్యములు గావు.

## తిరుపతి నుండి రాజమండ్రికి దేశాంతరకాలము

| సాయన మాసము | మేష | వృషభ | మిథున | కర్కాటక | సింహం | కన్య |
|---|---|---|---|---|---|---|
| | +౩౨ | +౩౯ | +౪౫ | +౪౮ | +౪౫ | +౩౯ |
| | తులా | వృశ్చిక | ధనుః | మకర | కుంభ | మీన |
| | +౩౨ | +౨౪ | +౧౬ | +౧౯ | +౧౬ | +౨౪ |

పై సంస్కార విఘడియలను తిథ్యాధికమునందు మేషాది సాయన మాసారంభ దినమున సంస్కరింపగా రాజమండ్రికి సూర్యోదయాది కాలమగును. మాసాదినుండి తిరిగి మాసాంతము వరకు అనుపాతముచే మధ్యదినము లందు సంస్కరింపవలెను.

పరమ దినప్రమాణం 32-3 పరమ క్షయదిన ప్రమాణం 27-57

# తిరుపతి (వేంకటాద్రి) ప్రాంతమందు సూర్యోదయాస్తమయ కాలములు

| 1992 సం\|\| | తేది | సూ. ఉ. గం. | ని. | సూ. అ. గం. | ని. |
|---|---|---|---|---|---|
| ఏప్రిల్ 1992 | 4 | 6 | 11 | 6 | 21 |
| | 5 | 6 | 10 | 6 | 21 |
| | 10 | 6 | 6 | 6 | 21 |
| | 15 | 6 | 03 | 6 | 22 |
| | 20 | 6 | 00 | 6 | 22 |
| | 25 | 5 | 58 | 6 | 23 |
| | 30 | 5 | 55 | 6 | 24 |
| మే | 5 | 5 | 53 | 6 | 25 |
| | 10 | 5 | 52 | 6 | 26 |
| | 15 | 5 | 50 | 6 | 28 |
| | 20 | 5 | 49 | 6 | 29 |
| | 25 | 5 | 48 | 6 | 31 |
| | 30 | 5 | 48 | 6 | 32 |
| జూన్ | 4 | 5 | 48 | 6 | 33 |
| | 9 | 5 | 48 | 6 | 35 |
| | 14 | 5 | 48 | 6 | 36 |
| | 19 | 5 | 50 | 6 | 38 |
| | 24 | 5 | 51 | 6 | 39 |
| | 29 | 5 | 52 | 6 | 40 |
| జూలై | 3 | 5 | 53 | 6 | 40 |
| | 8 | 5 | 54 | 6 | 41 |
| | 13 | 5 | 55 | 6 | 41 |
| | 18 | 5 | 56 | 6 | 40 |
| | 23 | 5 | 58 | 6 | 40 |
| | 28 | 5 | 59 | 6 | 38 |
| ఆగస్టు | 2 | 6 | 00 | 6 | 37 |
| | 7 | 6 | 02 | 6 | 36 |
| | 12 | 6 | 02 | 6 | 33 |
| | 17 | 6 | 02 | 6 | 31 |
| | 22 | 6 | 03 | 6 | 28 |
| | 27 | 6 | 04 | 6 | 26 |
| సెప్టెంబర్ | 1 | 6 | 04 | 6 | 22 |
| | 6 | 6 | 04 | 6 | 18 |
| | 11 | 6 | 05 | 6 | 15 |
| | 16 | 6 | 05 | 6 | 12 |
| | 21 | 6 | 05 | 6 | 08 |
| | 26 | 6 | 06 | 6 | 05 |

| 1992-93 సం\|\| | తేది | సూ. ఉ. గం. | ని. | సూ. అ. గం. | ని. |
|---|---|---|---|---|---|
| అక్టోబర్ | 1 | 6 | 06 | 6 | 00 |
| | 6 | 6 | 06 | 5 | 57 |
| | 11 | 6 | 06 | 5 | 54 |
| | 16 | 6 | 07 | 5 | 50 |
| | 21 | 6 | 08 | 5 | 48 |
| | 26 | 6 | 09 | 5 | 46 |
| | 31 | 6 | 10 | 5 | 44 |
| నవంబర్ | 5 | 6 | 12 | 5 | 41 |
| | 10 | 6 | 14 | 5 | 40 |
| | 15 | 6 | 16 | 5 | 39 |
| | 20 | 6 | 18 | 5 | 39 |
| | 25 | 6 | 20 | 5 | 39 |
| | 30 | 6 | 23 | 5 | 40 |
| డిసెంబరు | 5 | 6 | 26 | 5 | 40 |
| | 10 | 6 | 29 | 5 | 42 |
| | 15 | 6 | 32 | 5 | 44 |
| | 20 | 6 | 34 | 5 | 46 |
| | 25 | 6 | 37 | 5 | 48 |
| | 30 | 6 | 40 | 5 | 52 |
| జనవరి 1993 | 4 | 6 | 42 | 5 | 55 |
| | 9 | 6 | 43 | 5 | 58 |
| | 14 | 6 | 44 | 6 | 01 |
| | 19 | 6 | 45 | 6 | 03 |
| | 24 | 6 | 46 | 6 | 06 |
| | 29 | 6 | 45 | 6 | 08 |
| ఫిబ్రవరి | 3 | 6 | 44 | 6 | 10 |
| | 8 | 6 | 43 | 6 | 12 |
| | 13 | 6 | 42 | 6 | 14 |
| | 18 | 6 | 39 | 6 | 15 |
| | 23 | 6 | 37 | 6 | 16 |
| | 28 | 6 | 33 | 6 | 17 |
| మార్చి | 5 | 6 | 31 | 6 | 18 |
| | 10 | 6 | 28 | 6 | 18 |
| | 15 | 6 | 24 | 6 | 19 |
| | 20 | 6 | 21 | 6 | 20 |
| | 24 | 6 | 18 | 6 | 20 |

శ్రీ మహాగణపతయేనమః

# ఉపయుక్త శ్లోకములు
# నిత్యధ్యాన శ్లోకములు

## శ్రీ గణేశ స్తోత్రం

శ్లో॥ అగజానన పద్మార్కం । గజానన మహర్నిశం ।
అనేకదంతం భక్తానాం । ఏకదంత ముపాస్మహే ॥

## శ్రీ సరస్వతి స్తోత్రం

శ్లో॥ సరస్వతీ త్వియందృష్ట్వా । వీణాపుస్తకధారిణీ ।
హంసవాహన సంయుక్తా । విద్యాదానకరీమమ ॥

## శ్రీ వేంకటేశ్వర స్తోత్రం

శ్లో॥ శ్రియఃకాన్తాయ కల్యాణ । నిధయే నిధయేఽర్థినాం ।
శ్రీ వేంకట నివాసాయ । శ్రీనివాసాయ మంగళం ॥

## శ్రీ భూదేవి స్తోత్రం

శ్లో॥ విష్ణుశక్తి సముత్పన్నే । శంఖవర్ణ మహీతలే ।
అనేక రత్న సంభూతే । భూమిదేవి నమోస్తుతే ॥

## గురు ప్రార్థన

శ్లో॥ నిత్యానందైక కందాయ । నిర్మలాయచిదాత్మనే ।
జ్ఞానోత్తమాయ గురవే । సాక్షిణే బ్రహ్మణేనమః ॥

## పరమ భాగవతోత్తములు

శ్లో॥ ప్రహ్లాద నారద పరాశర పుండరీక । వ్యాసాంబరీష శుక శౌనక
భీష్మ దాల్భ్యాన్, రుక్మాంగదార్జున । వశిష్ఠ విభీషణాదీన్
పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి ॥

## వ్యాసప్రార్థన

శ్లో॥ అచతుర్వదనో బ్రహ్మ । ద్విబాహురవరోహరిః ।
అఫాలలోచన శ్శంభు । ర్భగవాన్ బాదరాయణః ॥

నవగ్రహ ప్రార్థన

శ్లో॥ నమస్సూర్యాయ చంద్రాయ । మంగళాయ బుధాయచ ।
గురు శుక్ర శనిభ్యశ్చ । రాహవే కేతవేనమః ॥

గోమాత ప్రార్థన

శ్లో॥ గావో మేమాతరస్సర్వా । గావోమే పితరస్సదా
గావో మమాగ్రతస్సంతు । గావోమే సంతుస్పష్టతః
గావోమే పార్శ్వతస్సంతు । గవాంబ్రుందేవసామ్యహం ॥

బిల్వవృక్ష ప్రార్థన (మారేడు)

శ్లో॥ త్రిదళం త్రిగుణాకారం । త్రినేత్రంచ త్రియాయుషం ।
త్రిజన్మ పాపసంహార । మేకబిల్వం శివార్పణం ॥

అశ్వత్థ ప్రార్థన (రావిచెట్టు)

శ్లో॥ మూలతో బ్రహ్మరూపాయ । మధ్యతో విష్ణురూపిణే ।
అగ్రత శ్శివరూపాయ । వృక్షరాజాయతేనమః ॥

సంధ్యా దీపం ప్రార్థన

శ్లో॥ శుభం భవతు కల్యాణీ । ఆరోగ్యం ధనసంపదం ।
మమశత్రు వినాశాయ । సాయం జ్యోతిర్నమోస్తుతే ॥

వాల్మీకి ప్రార్థన

శ్లో॥ కూజన్తం రామ రామేతి । మధురం మధురాక్షరం ।
ఆరుహ్య కవితా శాఖాం । వన్దే వాల్మీకి కోకిలం ॥

ఔషధ సేవ

శ్లో॥ ధన్వంతరిం గరుత్మంతం । ఫణిరాజంచ కౌస్తుభం ।
అచ్యుతం చామృతం చంద్రం । స్మరేదౌషధకర్మణి ॥

చంద్ర దర్శనం (నెలపొడుపు)

శ్లో॥ క్షీరసాగర సంపన్న । లక్ష్మీప్రియ సహోదర ।
హిరణ్య మకుటాన్ భాస్వత్ । బాలచంద్ర నమోస్తుతే ॥

పరాశర ప్రార్థన

శ్లో॥ ధర్మజ్ఞం ధార్మికం ధీరం । ధర్మాత్మానం దయానిధిం ।
ధర్మశాస్త్ర ప్రవక్తారం । పరాశరమునింభజే ॥

తులసీ ప్రార్థన

శ్లో॥ యన్మూలే సర్వతీర్థాని । యన్మధ్యే సర్వదేవతాః ।
యదగ్రే సర్వవేదాశ్చ । తులసీంత్వాం నమామ్యహమ్ ॥

సూర్యస్తవం

శ్లో॥ ఉదయే బ్రహ్మరూపశ్చ । మధ్యాహ్నేతు మహేశ్వరః ।
అస్తకాలే స్వయం విష్ణుః । త్రిమూర్తిశ్చ దివాకరః ॥

ప్రదక్షిణ నమస్కారం

శ్లో॥ అన్యధా శరణం నాస్తి । త్వమేవ శరణం మమ ।
తస్మాత్ కారుణ్య భావేన । రక్షరక్ష జనార్దన ॥
రక్షరక్ష పరమేశ్వర
రక్షరక్ష గణాధిప
రక్షరక్ష మహేశ్వరి

నిద్రలేచునపుడు (భూ ప్రార్థన)

శ్లో॥ సముద్ర వసనే దేవీ । పర్వతస్తన మండితే ।
విష్ణుపత్ని నమస్తుభ్యం । పాదస్పర్శం క్షమస్వమే ॥

కర దర్శనం

శ్లో॥ కరాగ్రే వసతే లక్ష్మీః । కరమధ్యే సరస్వతీ ।
కరమూలే స్థితా గౌరీ । ప్రభాతే కరదర్శనం ॥

భుజించునపుడు

శ్లో॥ అన్నం బ్రహ్మరసో విష్ణుర్భోక్తా దేవో మహేశ్వరః ।
ఏవం సంచిత్య భుంజానో దృష్టిదోషైర్నలిప్యతే ॥

భుజించిన పిదప

శ్లో॥ అగస్త్యం కుంభకర్ణంచ । శమ్యంచ బడబానలం ।
ఆహార పరిణామార్థం । స్మరామిచ వృకోదరం ॥

శ్లో|| శ్రీమద్గణేశం విధిముఖ్యవంద్యం గౌరీసుతం విఘ్నతమోదినేశం|
కళ్యాణ సంవర్ధిత భక్తలోకం సర్వార్థ సిద్ధ్యర్థమహం భజామి||

| | | | |
|---|---|---|---|
| కలియుగాబ్దములు | 5093 | శ్రీ శంకరాచార్యాబ్దములు | 2064 |
| విక్రమార్క శకాబ్దములు | 2049 | శాలివాహన శకాబ్దములు | 1914 |
| హిజరీ శకాబ్దములు | 1412,13 | శ్రీ రామానుజాబ్దములు | 975 |
| శ్రీ మధ్వాచార్యాబ్దములు | 875 | భారత స్వతంత్రాబ్దములు | 46 |
| ఆంధ్రరాష్ట్రావతారాబ్దములు | 39 | ఇంగ్లీషు | 1992-93 |

## నవనాయక నిర్ణయము

| | | | | | |
|---|---|---|---|---|---|
| రాజా | : | శనిః | అర్ఘాధిపతిః | : | రవిః |
| మంత్రీ | : | చంద్రః | మేఘాధిపతిః | : | చంద్రః |
| సైన్యాధిపతిః | : | చంద్రః | రసాధిపతిః | : | శనిః |
| సస్యాధిపతిః | : | గురుః | నీరసాధిపతిః | : | గురుః |
| ధాన్యాధిపతిః | : | కుజః | శుభులు 5+పాపులు 4= 9 మొత్తం. | | |

## ఉపనాయక నిర్ణయము

| | | | |
|---|---|---|---|
| పురోహితః | చంద్రః | నరాధిపతిః | చంద్రః |
| పరీక్షకః | గురుః | గ్రామాధీశః | రవిః |
| గణకః | శుక్రః | వస్త్రాధీశః | శనిః |
| గ్రామ పాలకః | చంద్రః | రత్నాధిపతిః | గురుః |
| దైవజ్ఞః | రవిః | వృక్షాధిపతిః | కుజః |
| రాష్ట్రాధిపతిః | గురుః | జంగమాధిపతిః | గురుః |
| సర్వదేశోద్యోగాధిపతిః | గురుః | సర్పాధిపతిః | శుక్రః |
| అశ్వాధిపతిః | చంద్రః | మృగాధిపతిః | రవిః |
| గజాధిపతిః | గురుః | శుభాధిపతిః | శనిః |
| దేవాధిపతిః | గురుః | స్త్రీణామధిపతిః | రవిః |
| పశూనామధిపతిః | గురుః | శుభులు 13+పాపులు 8=మొత్తం 21. | |

# సంవత్సర ఫలితాంశము

చాంద్రమానము వలన ఈ సంవత్సరమును 'అంగీరస' అనియు 'అంగిరా' అనియు వ్యవహరింపబడును. బార్హస్పత్య మానము వలన (ఉత్తరాది ప్రాంతమున) 'పార్థివ' సంవత్సరమనియు, గురూదయాబ్దమున ఫాల్గుణాబ్దమనియు వ్యవహరింపబడును.

బృహస్పతి దేవతాకమగు ద్వితీయ యుగమున వర్తమానమున పంచవత్స రాత్మకమగు ద్వితీయ యుగమునందు మొదటిది వహ్ని దేవతాకమయిన 'సంవత్సర' నామముగల ఈ అంగిరా నామ సంవత్సరమున తిలదానము విశేషపుణ్యఫలదము. రాత్రియందార్ద్రా ప్రవేశము సస్యవృద్ధి. 1 కుంచము వర్షము అందు 10 భాగములు సముద్రమందును, 9 భాగములు పర్వత ప్రాంతమందును, 1 భాగము భూమి యందును వర్షించును. పశునాయకుడు పశువులను బయటకు వదలి మేపి బంధించువాడు బలరాముడు. పశువులను మేపువాడు శ్రీకృష్ణుడు. 16 వీసములకు 9 వీసములపంట ఫలించును. నలుపు, ఎరుపు, అల్పవరి వంగడములధికముగ పండును.

ఇందు నవనాయకులలో నైదుగురు శుభులు, నల్వురు పాపులు అయిరి. ఉపనాయకులలో 13 మంది శుభులు, 8 మంధి పాపులైరి.

| | | | |
|---|---|---|---|
| రా చం బు శు | | ల | కే |
| కు | వర్షలగ్నము | | |
| శ | | | గు |
| రా | | | |

| | | | |
|---|---|---|---|
| ర బు శు | | | కే |
| కు | జగల్లగ్నము | | |
| శ | | | చం గు |
| రా | | | ల |

వర్ష లగ్నమును పరిశీలించగా లగ్నాధిపతికి ఉచ్చస్థితి, ధన, పంచమాధిపతికి నీచ భంగ రాజయోగము. లగ్న ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ, సప్తమాధిపత్యములుగల 4 గ్రహములకు ఏకాదశమందు కలయిక, భాగ్యరాజ్యాధిపతి శనికి స్వక్షేత్రస్థితి, అష్టమ రాహువు, చతుర్థ లాభాధిపుల పరివర్తన మున్నగు విశేష గమనములతో విరాజిల్లుచున్నది. ధీనివలన దేశమునకు అభివృద్ధి పదము, దేశపారిశ్రామిక, యాంత్రిక, ఆర్థిక, ఆరోగ్యవిషయములు వృద్ధికల్గు సూచనలున్నవి. దేశపురోభివృద్ధి బాగుండును.

జగల్లగ్నమును పరిశీలించగ లగ్నాధిపునికి నీచభంగ రాజయోగము కల్గి సప్తమందు రవితో కలసివుండుట. వ్యయమందు చంద్ర గురుల గజకేసరీ యోగము మున్నగు యోగములున్నవి. వీనిని పరిశీలించగ దేశము సౌఖ్యప్రదముగ అభివృద్ధిగ నుండును. ఉద్యోగులవృద్ధి, సౌఖ్యములు,

వాణిజ్య సంస్థలభివృద్ధిగను, ఆర్థిక విషయమై ప్రభుత్వము చర్యలుగైకొనుట. దేశము విదేశముల కంటె మొత్తము మీద ముందంజ వేయుచుండును. దైవకార్యములు చేయుచుందురు. ఉత్పత్తులధికమగుచుండును. గతంకంటె చాలా మేలుగ వుండును. పసుపు, మిర్చి, కొబ్బరి, తైలాదులు మరియు లోహాదులు ధరలు హెచ్చి నిలబాటు.

స్వల్ప కాలిక పంటలధికముగ పండిననూ 3 వంతులు చేతికందును. స్వల్ప వర్షములు, నల్లని కారు మబ్బులు, నిరంతర వర్షములు, మార్గావరోధములు కుల, మత విద్వేషాగ్నులు కల్గుచుండును. చైత్రాది ప్రాంతమందు ధరలు మందముగను, వ్యాపార సంస్థలందు భేదములుగను, వాతావరణ మార్పులుగ నుండును. మే,జూన్,జూలై ప్రాంతములందు వడగాడ్పులధికములు. గాలి అధికముగ వీచును. 1,2 పర్యాయములు ఆకస్మిక వర్షములు కల్గును. అగస్టు ప్రాంతములందు మేఘాడంబరములు, శస్త్రాగ్ని, బాధలు అధికమగును. భూకంపాద్యుపద్రవములు విదేశములందు కల్గును. సువృష్టి కల్గును. సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు మాసములందు అల్ప వర్షములు, తిలతైలాదులకు అధిక ధరలు, మిశ్రమ వాతావరణములు. డిశెంబరు ప్రాంతములందు నూతన ఖగోళ యాంత్రిక దృశ్యములు విజయవంతములు. సరిహద్దు భద్రతలు నూతన వ్యాపార సంస్థలు ప్రారంభము చేయుట, అధికారుల పర్యటనలు, జనవరి, ఫిబ్రవరి ప్రాంతములందు రాష్ట్ర అధికార వర్గ మార్పు సూచనలు. దేశ విదేశములకు మధ్య పరస్పర భేద, సహకారములు కల్గుచుండును. రాజకీయకల్లోలములు. కులమత సంఘర్షణలు, భూసంస్కరణాది వ్యవహారములు, ఆర్థిక దుర్వ్యయములు మున్నగు సూచనలు గలవు.

కేంద్ర ప్రభుత్వము మంచి పేరు ప్రతిష్ఠలతో అభివృద్ధిలోనికి వచ్చును. సెప్టెంబరు తరువాత అధికారుల మనోభేదములవలన ప్రతిష్ఠకు భంగము కల్గుసూచనలున్ననూ భారత చక్రముననుసరించి రాజ్యమునకు రాజుకు కీర్తి కల్గును. శతృవులు మిత్రులగుదురు. సన్మార్గపాలన కల్గును.

మొత్తము మీద సంవత్సర ఫలితము బాగుగనే వున్నది. ధాన్యమునకు ధరలు కొద్ది హెచ్చి నిలబాటగును. ఉత్తరార్థము కొంత శాంతి తక్కువగ వున్ననూ ప్రజలు దైవకార్యాచరణలు. అన్న శాంతులు చేయుట ద్వారా దేశమునకు శాంతి సౌభాగ్యములు కల్గును. 12-10-93 తేదీ శ్రీ కావేరినదికి పుష్కరమేర్పడు చున్నది. రాబోవు శ్రీ శ్రీముఖనామ సంవత్సరమందు భాద్రపదమధికమాసమగుచున్నది.

## కర్తరీ నిర్ణయము

ది. 4-5-92 తేది వైశాఖ శుద్ధ విదియా సోమవారం డొల్లుకర్తరీ, 10-5-92 అష్టమీ ఆదివారం రాత్రియందు కృత్తిక కార్తె-నిజకర్తరీ ప్రవేశము. 28-5-92 వైశాఖ బహుళ ఏకాదశీ గురువారం వరకు నిజకర్తరి వుండును.

## మౌఢ్య నిర్ణయము

గురుమౌఢ్యమి: ది 4-9-92 తేదీ భాద్రపద శుద్ధ అష్టమీ శుక్రవారం నుండి ఆశ్వయుజ

శుద్ధ పంచమీ గురువారం 1-10-92 వరకు గలదు.

శుక్ర మౌఢ్యమి: ది 11-5-92 తేదీ వైశాఖ శుద్ధ దశమీ సోమవారం నుండి 16-7-92 ఆషాఢ బహుళ విదియా గురువారం వరకు గలదు.

## పుష్కర నిర్ణయము

31-8-92 తేదీ భాద్రపదం వినాయక చవితి సోమవారం నుండి 11-9-92 పూర్ణిమా శుక్రవారం వరకు శ్రీ గోదావరీ నదికి అంత్య పుష్కరములుండును.

ఈ 11-9-92 తేదీ సాయంత్రం గం. 4-41 ని. లకు శ్రీ కృష్ణానదీ పుష్కరములు ప్రారంభమగును.

## గ్రహణ నిర్ణయము

ది 9-12-1992 తేదీ మార్గశిర శుద్ధ పూర్ణిమా దినమున చంద్రగ్రహణము సంభవించును.

## వర్షాధిక స్థితి నిర్ణయము

వత్సరాది నుండి శ్రావణ బహుళ 13 బుధ 26-8-92 వరకు వృద్ధ గోప హస్తమునందు వర్షకుంచముండును. 26-8-92 నుండి 30-11-92 మార్గశిర శుద్ధ షష్ఠి వరకు యౌవ్వన గోపహస్తమునందును, తరువాత 5-3-93 తేదీ ఫాల్గుణ శుద్ధ ద్వాదశి వరకు వృద్ధ గోపహస్తమం దును తరువాత వత్సరాంతం వరకు బాల్య వేశ్యయొక్క చేతియందును వర్షకుంచ ముండును.

వృద్ధ గోపాలుని హస్తమందుండు కాలమున సుభిక్షము వృద్ధి కల్గును. యౌవ్వన గోపహస్త మందుండు నపుడు సుభిక్షము, ఆహార, క్షీర సమృద్ధి, సస్యానుకూల వర్షములు, సమధరలు, బాల్యవేశ్యచేతియందుండు నపుడు ఉత్సాహము వలన అతివృష్టి, అనావృష్టి ఏర్పడుచుండును.

**సావనవర్షారంభము:** 29-11-92 తేదీ ఆదివారము సావన వర్షారంభమగును. ఆదివార మయినందున మధ్యవృష్టి, రాజులు గొప్పసేనలతో శత్రుదేశములపై దండెత్తగలరు. అధికారులు పరస్పరము భేదాభిప్రాయములతో నుందురు.

## విజయదశమీ నిర్ణయము

ఆశ్వయుజ శుద్ధ నవమీసోమ ౧౪-౧౭ ఉ.షా. ౩౩-౫౩ 5-10-1992

దశమీ మంగళ ౧౮-౩౩ శ్రవణ ౩౯-౫౦ 6-10-1992

విజయ దశమీ, శమీపూజ, అపరాజితాదేవీ పూజలు అపరాహ్న వ్యాప్తి గల దశమీ రోజున

చేయవలసి యున్నది. ఇందు రెండు రోజులలో దశమి పూర్వదినమున పూర్తి అపరాహ్న వ్యాప్తియును, మరుదివమున దశమి సుమారు 1 ½ ఘడియ అపరాహ్న వ్యాప్తియును కల్గియున్నది.

'యదాతు పూర్వదిన ఏవ అపరాహ్ణవ్యాపినీ దశమీ, పరదినే స్వల్పాపి శ్రవణయోగవతీ' 'పరైవ' అని ధర్మ సింధ్వాది గ్రంధములందుండుట వలన ఈ విజయదశమీ పర్వదినమును 6-10-92 మంగళ వారముననే ఆచరింపవలెను. గావున విజయదశమీ పండుగను, శమీపూజా, అపరాజితా దేవీ పూజలు మంగళ వారమాచరింపవలెను.

## చంద్ర గ్రహణ నిర్ణయము (9-12-1992)

శ్రీ అంగిరా నామ సంవత్సర మార్గశిర శుద్ధ పూర్ణిమా బుధవాసరే, మృగశిర్షా నక్షత్ర యుక్త వృషభరాశి, కేతుగ్రస్త, ముచ్యమానాస్తమయ ఖచ్ఛన్న చంద్రగ్రహణము. సవ్యగ్రహణము.

| | | | |
|---|---|---|---|
| సూర్యాస్తమయాది స్పర్శకాలః | ఘ ౨౪-౨౮ | రా.గం. | 3-29 |
| మధ్యకాలః | ౨౮-౪౮ | | 5-13 |
| శుద్ధమోక్షః | ఉ.ఘ ౧-౧౨ | ఉ.గం. | 6.57 |
| ఆద్యంత్యపుణ్యకాలః | | గం | 3.28 నిలు |
| సూర్యాస్తమయః | 5.42 | | |

ఆగ్నేయదిశి స్పర్శ, వాయువ్యదిశి నిమీలనం, ఈశాన్యదిశిమోక్షః

## నిత్యభోజన ప్రత్యాబ్దికాది నిర్ణయము

ఈ గ్రహణము బుధవారం రాత్రి యందు సంభవించుచున్నందున బుధవారం సాయంత్రం లోగా నిత్యభోజన ప్రత్యాబ్దికాదు లాచరింపవలెను.

మృగశిరానక్షత్రము వారు వృషభరాశి వారు దీనిని చూడరాదు. గ్రహణానంతరము యధా విధిగ శాంతి జరుపుకొనుట మంచిది.

## చాంద్రమానాబ్ది ఫలమ్

శ్లో. అన్నాద్యం భుంజతే శశ్వజ్జనై రతిథిభిస్సహ|

అంగిరాబ్దేఽఖిలా లోకా భూపాశ్చ కలహోత్సుకాః||

ఈ అంగిరా సంవత్సరమునందు ప్రజలు నిత్యము స్నేహితులతోను, అతిథులతోను విందు భోజనములు చేయుచుందురు. అధికారులు పరస్పరము భేదాభిప్రాయములు కల్గియుందురు. మేఘాడంబరము అధికము, ఉష్ణ బాధలధికముగ వుండును.

## బార్హస్పత్య మానాబ్ద ఫలమ్

శ్లో.వృషద్వర్షం సుసస్యంచ వృద్ధిర్జనః చతుష్పదాం|

కీర్తివాహో నృపావైరి ప్రలుప్తాశ్చైవ పార్థివే||

తుషారవృష్టి, సస్య సమృద్ధి, సస్యక్షయములు, పశుగ్రాసములు గురించి చర్యలు గైకొనుట, ఆషాఢ మాస ప్రాంతములందు ధాన్యాదులకు అధిక ధరలగుట, శ్రావణ మాసమున ఖండవృష్టి, తరచు వర్షములు, చివరకు ధరలు సమము మున్నగు ఫలితములుండును.

## గురూ దయాబ్ద ఫలమ్

ఈ సంవత్సరము ఫాల్గుణాబ్దమయినందున అతివృష్టి, అనావృష్టి, రాజకీయకల్లోలములు, అల్ప సస్యవృష్టి, స్త్రీల యందరాచరికములు. తూర్పుదేశములందు భయోత్పాతములు కల్గుచుండును.

## రాజాధి నవనాయక ఫలములు

**1. రాజా శనిః :**

శ్లో.చోరాగ్ని శస్త్రబాధాభిః పీడ్యంతే మనుజాభృశం|

అల్ప సస్యంచాల్పవృష్టిం కరోత్యబ్దాధిపశ్శనిః||

శని రాజయినందున మనుష్యులు చోరాగ్ని శస్త్రబాధలనుండి తప్పించుకొనగల్గుచుందురు. వృష్టిఫలితము సామాన్యము. మతకల్లోలము లధికముగా నుండును. రాజకీయములందు ఒడిదుడుకులధికముగ వుండును.

**2. మంత్రీ చంద్రః ఫలమ్ :**

శ్లో.సువృష్టి స్సర్వ సస్యాని ఫలితాని భవంతిచ|

క్షేమారోగ్యం సుభిక్షం స్యా చ్ఛశాంకే సచివేసతి||

ప్రజాభ్యుదయము, రాజకీయాభ్యుదయము, సువృష్టియు, క్షేమ, ఆరోగ్యములు కల్గును. ద్విజాతులు ధర్మకార్యములనాచరించెదరు.

**3. సైన్యాధిపతిశ్చంద్రః ఫలమ్ :**

శ్లో.అతివర్ష మతీ వార్త మరోగాస్సుఖినో జనాః|

బహు క్షీర ప్రదాగావః చంద్రే సేనాధిపేసతి||

పశు క్షేమము, అనుకూల వర్షములు, జనులకు రోగనివారణలు కల్గును. దేశ చతురంగ బలములు దేశభవిష్యత్తుకై పాటుపడుచుందురు.

## 4. సస్యాధిపతిర్గురుః ఫలమ్ :

శ్లో.యవ గోధూమ చణకాః ఫలితాశ్చ భవంతి హి|

పీత ధాత్రీ చ ఫలితా గురౌ సస్యాధి పేసతి||

పూర్వ సస్యములు అధికముగ ఫలించును. అపరములు, వస్త్రమూలకములు, విరివిగ ఫలించును. ఆకస్మిక సువృష్టి కల్గును.

## 5. ధాన్యాధిపతిః కుజః ఫలమ్ :

శ్లో.ఫలంతిశూక ధాన్యాని కించిద్ధాన్యాని యానిచ|

రక్త భూమిస్తు ఫలితా భౌమే ధాన్యాధి పేసతి||

ముల్లు ధాన్యములు, అపరములు, ఎరుపు భూములు, బాగుగ ఫలించును. మొత్తము మీద ధాన్య పంటలు మధ్యమముగ వుండును. సస్యములకు కీటక మూషిక బాధలధికముగ వుండును. ధాన్యాదులకు ధరలు అధికముగ నిలబాటు.

## 6. అర్ఘాధిపతిః రవిః ఫలమ్ :

శ్లో.అనర్ఘమల్ప వృష్టించ ప్రజానాం క్షుద్భయం తథా|

రాజ్ఞాంపరస్పర క్రోధాస్సూర్యే చార్ఘ పతౌసతి||

ప్రభుత్వ పాలన సవ్యముగనుండును. ధరలు అందుబాటులో వుండును. అధికారులనడుమ అంతః కలహములు ప్రబలును. ఎరుపు జాతి ధాన్యాదులకు, మణులకు ధరలు అధికమగును.

## 7. మేఘాధిపతి చంద్రుడు :

అన్ని ప్రాంతములందును వర్షములు సమానముగ తరచు కురియుచుండును. ఈశాన్య వాయువ్య దిశలందు వర్షము అధికముగ వుండును. కారుమబ్బులు క్రమ్ముటవలన ప్రజలు భయభ్రాంతులగుదురు.

## 8. రసాధిపతి శని :

నూనె, బెల్లం, తెలం జాతి వానికి, కందమూలములకు ధరలు అధికమగును. వీనికై వాతావరణ ప్రతికూలతలధికముగ వుండును.

## 9. నీరసాధిపతి గురుడు :

బంగారాది లోహ ధరలు కొద్దిగ ప్రజలకు అందుబాటులో నుండును. వృక్షములు విరివిగ ఫలించును. పుష్పములు బాగుగ పూయును.

## మేఘాది నిర్ణయము

ద్రోణ నామక మేఘము అధిక వర్షములు, మధ్య ప్రదేశము లందుండుట, రోగ భయ ములు, తూర్పు దిశలందరిష్టములు. ప్రత్తి, నెయ్యి, ధాన్యాదులకు ఉత్పత్తికి హాని, సౌదామిని అను మెరుపు సువృష్టి, పద్మకుడను నాగము భూమిని వహించును. ప్రజా సుఖములుండును. యింద్రధనుస్సు లేర్పడుచుండును. శీతోత్సవము లధికముగ వుండును.

### మకర సంక్రమణ పురుష లక్షణము

ది. 14-1-1993 తేదీ ఉదయం గం.7-59 ని. లకు శ్రీ అంగిరా నామ సంవత్సర పుష్య బహుళ సప్తమీ గురువారం, హస్త నక్షత్ర మకర లగ్నము, అతిగండ యోగము, భద్రకరణము, పగటియందు 2వ ముహూర్త కాలమున రవి మకర రాశియందు ప్రవేశించును.



శ్లో. త్రిశిరం ద్విముఖం చైవ చతుర్వక్త్రం త్రినేత్రకం|
లంబకర్ణం రక్తదంతం లంబ భ్రూర్ధ్వనాశికం||
అష్టబాహుం ద్విపాదంచ వికృతం కృష్ణవర్ణకమ్|
శతయోజనమౌన్నత్యం విస్తీర్ణం ద్వాదశన్మృతం||
ఏవం రూపం హి విజ్ఞేయం సంక్రాంతేః పురుషస్యతు

మిశ్రానామధేయం - విప్రాణామరిష్టం, నింబోదకము - మహాభీతి. బొంత వస్త్రధారణము అసౌఖ్యము, కర్పూర గంధ లేపనము - సుఖము, చంపక పుష్ప ధారణము - మనో వ్యాకులము. గ్రైవేయ ధారణం - సస్యనాశనము, రాతిపాత్రలో భోజనము - వ్యాధినివారణము. బెల్లం ఆహార మగుటచే అధిక ఆకలి. ఇప్పపూవు భక్షణము - శుభ ప్రదము, పాశాయుధ ధారణము - భయభ్రాంతత, కంబళి గొడుగు - దుఃఖ నిర్మూలనము. శునక వాహనము - అసమృద్ధియు, అధోముఖ దృష్టి వలన సుభిక్షత, కూర్చుని వుండుటచేస్థిరమైన ధరలు, ఈశాన్యదిశ ప్రయాణము - అప్రాంతములకరిష్టము - మున్నగు లక్షణములు ఈ మకర సంక్రాంతి పురుషుని వలన కల్గుచున్నవి.

కృష్ణ పక్షేయదా పౌషే మకరస్థే దివాకరః|
సుభిక్షం క్షేమమారోగ్యం జంతూనామశుభ ప్రదమ్.||

ఉదయకాలము. గురువారము, సప్తమీ వుండుటవలన దేశమునకు శుభము కల్గును.

## వర్ష ధాన్య ప్రమాణాదులు

వర్షం 9, ధాన్యం 7, శీతం 15, తృణం 17, ఉష్ణం 9, వాయు 9, ప్రజావృద్ధి 15, నాశ 11, రాజవిద్వరం 0, ఉగ్రం 0, పుణ్యం 0, పాపం 0, వ్యాధి 9, ఉపశమనం 3, ఆచారము 3, అనాచారం 15, జననం 9, మరణం 3, దేశోపప్లవ 9, చోరభయం 3, శాంతి 9, అగ్నిభయం 13, శాంతి 17, మృగోపద్రవం 5, మృగక్షయ 13, కీటకభయం 9, నాశ 3, మూషిక వృద్ధి 11, సర్పోప 3, నాశ 3, కామం 13, లోభం 17, మోహం 13, మదం 3, మాత్సర్యం 15, సుఖం 15, దుఃఖం 11, భోగం 3, విదంబం 9, మనోవేదన 17, ద్వేషం 15, ప్రతిష్ఠ 11, అప్రతిష్ఠ 3, ద్యూతం 1, మత్తత 9, పురుష ఉత్పత్తి 17, స్త్రీ ఉత్పత్తి 9, ధాతు వృద్ధి 13, భయం 19, శౌర్యం 7, దుష్టశిక్షణ 11, శిష్టర 15, సత్యం 19, అసత్యం 4, విశ్వాసం 7, అవిశ్వాసం 9, దయ 11, నిర్దయ 13, న్యాయం 15, అన్యాయం 17.

గోమాయు వృద్ధి 7, నాశ 13, సస్య కీటక వృద్ధి 13, క్షయం 4, శలభ వృ 4, నాశ 13, మశక వృ 13, నాశ 7, మత్స్యాణ 1, నాశ 10, వృశ్చిక వృ 4, నాశ 4, వ్యాఘ్రవృ 7, నాశ 4, పక్షి వృద్ధి 2, నాశ 5, ధేను వృ 2, నాశ 2, మహిష వృ 3, నాశ 5, మృగ వృ 1, నాశ 1, వైశ్య వృద్ధి 5, నాశ 2, శూద్ర వృద్ధి 3, నాశ 3, మ్లేచ్ఛ వృ 3, నాశ 4, సంకర వృ 2, నాశ 2, నవరత్న వృద్ధి 5, నాశ 2, అశ్వ వృ 4, నాశ 1, గజ వృ 4, నాశ 2, ఉష్ట్ర వృ 4, నాశ 1, విప్ర వృద్ధి 2, నాశ 3, క్షత్రియ వృద్ధి 4, నాశ 5, రత్నాదులు వృద్ధి క్రమముగ 1, జ్ఞానం 7, అజ్ఞానం 11, కపటం 7, నిష్కపటం 3, ధార్మికం 3, అధార్మికం 5, అతివృష్టి 7, అనావృష్టి 15, స్వచక్ర భయం 15, పరచక్ర భయం 3, శిష్టత 1, రస నిష్పత్తి 13, ఫల నిష్పత్తి 3, ఉత్సాహం 9.

### కందాయ ఫలములు

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వి | భర | కృ | రో | మృ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్రే | మఘ | పుబ్బ | ఉత్తర |
| 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 |
| 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 |
| 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 |

| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| హస్త | చిత్త | స్వా | వి | అనూ | జ్యే | మూల | పూ.షా. | ఉ.షా. | శ్ర. | ధ | శత | పూ.భా. | ఉ.భా. | రే. |
| 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 |
| 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 |
| 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 |

ఇందలి బేసి సంఖ్యలు ధనలాభమును, సమ సంఖ్యలు సమ ఫలమును, శూన్య సంఖ్య శూన్యఫలమును కలుగచేయును. మొదటి సున్న రోగభయమును మధ్యసున్న మనోభీతిని, చివరి సున్న హానిని తెలుపును. ఒక్కొక్క సంఖ్య 4 మాసముల ఫలితమును తెల్పును.

| ఆదాయ వ్యయములు | | | రాజపూజ్యావమానములు | | |
|---|---|---|---|---|---|
| రాశి | ఆదాయం | వ్యయం | రాశి | రాజపూ | అవ |
| మేషం | 14 | 14 | మేషం | 3 | 6 |
| వృషభం | 8 | 8 | వృషభం | 6 | 6 |
| మిథునం | 11 | 5 | మిథునం | 2 | 2 |
| కర్కాటకం | 5 | 5 | కర్కాటకం | 5 | 2 |
| సింహం | 8 | 14 | సింహం | 1 | 5 |
| కన్య | 11 | 5 | కన్య | 4 | 5 |
| తుల | 8 | 8 | తుల | 7 | 1 |
| వృశ్చికం | 14 | 14 | వృశ్చికం | 3 | 1 |
| ధనుస్సు | 2 | 8 | ధనుస్సు | 6 | 1 |
| మకరం | 5 | 2 | మకరం | 2 | 4 |
| కుంభం | 5 | 2 | కుంభం | 5 | 4 |
| మీనం | 2 | 8 | మీనం | 1 | 7 |

సర్వాదాయము 93, వ్యయము 93. ఆదాయ వ్యయములు సమానము.

## సంవత్సర ఫలము

| | | | | | |
|---|---|---|---|---|---|
| అశ్విని | పుష్యమి | స్వాతి | అభిజిత్ ల వార్కి | | రాజపూజ్యత |
| భరణి | ఆశ్లేష | విశాఖ | శ్రవణ | ,, | యుద్ధ భయం |
| కృత్తిక | మఘ | అనూ | ధనిష్ఠ | ,, | అలంకార ప్రాప్తి |
| రోహిణి | పుబ్బ | జ్యేష్ఠ | శతభిషం | ,, | రోగభయం |
| మృగశిర | ఉత్తర | మూల | పూ.భా. | ,, | ఆయుర్వృద్ధి |
| ఆర్ద్ర | హస్త | పూ.షా. | ఉ.భా. | ,, | అర్థ లాభము |
| పున | చిత్ర | ఉ.షా. | రేవతి | ,, | మనస్తాపము |

## 1992-93 శ్రీమదంగిరా నామ సంవత్సర కార్తెలు - వృష్టి నిర్ణయములు

| నెం | కార్తెలు | తేదీలు | వారం | ప్రవేశం | ఫలితము |
|---|---|---|---|---|---|
| 1. | భరణి | 27-4-92 | సోమ | ఉ.గం. 8-49 | అనావృష్టి |
| 2. | కృత్తిక | 10-5-92 | ఆది | రాత్రి 3-44 | స్వల్ప |
| 3. | రోహిణి | 28-5-92 | ఆది | రాత్రి 2-03 | అనావృష్టి |
| 4. | మృగశిర | 7-6-92 | ఆది | రాత్రి 12-40 | ఖండవృష్టి |
| 5. | ఆర్ద్ర | 21-6-92 | ఆది | రాత్రి 1-37 | అనావృష్టి |
| 6. | పునర్వసు | 5-7-92 | ఆది | రాత్రి 3-15 | స్వల్పవృష్టి |
| 7. | పుష్యమి | 19-7-92 | ఆది | రాత్రి 4-56 | స్వల్పవృష్టి |
| 8. | ఆశ్రేష | 2-8-92 | ఆది | రాత్రి 5-11 | ఖండవృష్టి |
| 9. | మఖ | 16-8-92 | ఆది | రాత్రి 3-54 | సువృష్టి |
| 10. | పుబ్బ | 30-8-92 | ఆది | రాత్రి 12-19 | సువృష్టి |
| 11. | ఉత్తర | 13-9-92 | ఆది | రాత్రి 6-14 | సువృష్టి |
| 12. | హస్త | 27-9-92 | ఆది | ఉ.గం. 9-20 | చిత్రవృష్టి |
| 13. | చిత్ర | 10-10-92 | శని | రాత్రి 9-38 | ఖండవృష్టి |
| 14. | స్వాతి | 24-10-92 | శని | ఉ.గం. 7-17 | చిత్రవృష్టి |
| 15. | విశాఖ | 6-11-92 | శుక్ర | ప. 2-20 | సువృష్టి |

## శ్రీ అంగిరానామ సంవత్సరములో గ్రహసంచారములు

### రవిసంచారము

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1992 ఏప్రిల్ | 13 | మేషం | సా.గం. | 4-33 | అక్టోబర్ | 17 | తుల | ప.గం. | 2-43 |
| మే | 14 | వృషభం | ప.గం. | 2-48 | నవంబర్ | 16 | వృశ్చికం | ప.గం. | 12-17 |
| జూన్ | 14 | మిథునం | రా.గం. | 12-53 | డిశంబర్ | 15 | ధనుషి | రా.గం. | 12-10 |
| జూలై | 16 | కటకం | సా.గం. | 4-30 | 1993 జనవరి | 14 | మకరం | ఉ.గం. | 7-59 |
| ఆగస్టు | 16 | సింహం | తె.గం. | 3-54 | ఫిబ్రవరి | 12 | కుంభం | సా.గం. | 6-51 |
| సెప్టెంబర్ | 16 | కన్య | తె.గం. | 4-11 | మార్చి | 14 | మీనం | ప.గం. | 2-29 |

## కుజ సంచారము

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఏప్రిల్ | 27 | మీనం | రా. గం. | 11-52 | సెప్టెంబరు | 1 | మిథునం | రా. గం. | 8-10 |
| జూన్ | 6 | మేషం | ఉ. గం. | 10-50 | నవంబరు | 3 | కటకం | రా. గం. | 11-51 |
| జూలై | 17 | వృషభం | రా. గం. | 11-04 | డిశెంబరు | 22 | మిథునవక్రీ | రా. గం. | 2-11 |

## బుధ సంచారము

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మే | 7 | మేషం | ఉ. గం. | 10-46 | అక్టోబరు | 24 | వృశ్చికం | ప. గం. | 2-35 |
| మే | 23 | వృషభం | రా. గం. | 3-14 | నవంబరు | 27 | తుల | ప. గం. | 12-03 |
| జూన్ | 6 | మిథునం | తె. గం. | 2-04 | డిశెంబరు | 5 | వృశ్చికం | రా. గం. | 10-45 |
| జూన్ | 22 | కటకం | రా. గం. | 3-27 | డిశెంబరు | 29 | ధనుష్షి | ప. గం. | 4-35 |
| ఆగస్టు | 30 | సింహం | రా. గం. | 12-42 | 93 జనవరి | 17 | మకరం | రా. గం. | 10-09 |
| సెప్టెంబరు | 15 | కన్య | రా. గం. | 12-42 | ఫిబ్రవరి | 4 | కుంభం | ఉ. గం. | 9-46 |
| అక్టోబరు | 3 | తుల | ప. గం. | 2-40 | ఫిబ్రవరి | 25 | మీనం | రా. గం. | 2-38 |

## గురు సంచారము

సెప్టెంబరు 11 సా. గం. 4-41 ని.లకు॥ కన్యాప్రవేశం కృష్ణాపుష్కర ప్రారంభము

## శుక్ర సంచారము

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఏప్రిల్ | 26 | మేషం | రా. గం. | 7-18 | సెప్టెంబరు | 20 | తుల | ఉ. గం. | 6-29 |
| మే | 20 | వృషభం | తె. గం. | 4-32 | అక్టోబరు | 14 | వృశ్చికం | రా. గం. | 7-30 |
| జూన్ | 14 | మిథునం | ప. గం. | 2-43 | నవంబరు | 8 | ధనుస్సు | ప. గం. | 1-30 |
| జూలై | 8 | కటకం | రా. గం. | 12-38 | డిశెంబరు | 3 | మకరం | ప. గం. | 3-39 |
| ఆగస్టు | 2 | సింహం | ప. గం. | 10-02 | డిశెంబరు | 29 | కుంభం | ప. గం. | 2-47 |
| ఆగస్టు | 26 | కన్య | రా. గం. | 7-40 | 93 జనవరి | 26 | మీనం | రా. గం. | 12-57 |

## శని సంచారము

1993 మార్చి 5 రాత్రి 7-13 వరకు మకరరాశిలో సంచరించును. తదాదివత్సరాంతము కుంభము నందు ప్రవేశించి సంచరించును.

## రాహు కేతువులు

1992 అక్టోబరు 30 పగలు గం. 2-30 వరకు రాహువు ధనుస్సునందు కేతువు మిధునము నందు సంచరించును. తదాది వత్సరాంతము వరకు రాహువు వృశ్చికమున, కేతువు వృషభమున సంచరించును.

# మాసాధిపతుల ఫలితములు

జన్మ లేక నామ నక్షత్ర గడికి క్రింద వరుసలోని మాసాధిపతికి గల ఫలితాలను ప్రక్క పేజీలో చూడవలయును.

రవి : పనులతొందర, ఒత్తిడి, అలస్యం, తూర్పుప్రయాణము. దుఃఖం, శిరోవేదన, భయం రాజభీతి, నిరుత్సాహం, ఆశాభంగం, శ్రమ, కోపం, శాంతికి రుద్రాభిషేకం, సూర్యస్తుతి.

బుధ : బంధుగోష్ఠి, విద్వజ్జన సంగమం, వర్తక జనస్నేహం, వ్యాపారవృద్ధి, భవిష్యత్ ఆలోచనలు, హాస్యసంభాషణ, ధనలాభం, ప్రయత్నసిద్ధి, విష్ణుభక్తి.

రాహు : ఆతృత, స్మశాన దర్శనం, దైన్యం, వ్యసనం, కడుపునందు బొడ్డునందు వ్యాధి, కోపం, ధననష్టం, ప్రయాణంలో దొంగలభయం, శాంతికి దుర్గాపూజ, రాహుపూజ.

గురుడు : ధనలాభం, గురు ఆదరణ, జ్ఞానం, సుఖం, భార్యకు ఆభరణములు, సంతానసౌఖ్యం పడమరకు ప్రయాణం, మంచి వస్త్రధారణ, స్థిరవృద్ధి, సర్వశుభం.

కేతువు : బంధువైరం, దుష్టస్త్రీ పీడ, మనోచాంచల్యం, దైవభక్తి, అతికోపం, దీర్ఘతర్కం, పుణ్యకర్మలు, స్వల్పాధికారం, పాము వల్ల ప్రమాదం, తఱచుద్రవ్యనష్టం, శాంతి:- మహారుద్రాభిషేకం, కేతుస్తుతి.

చంద్రుడు : మాతృసౌఖ్యం, దధ్యన్న సౌఖ్యం, స్త్రీ సంభోగసుఖం, మనోనిర్మలత, ఆనందం, గౌరవం, కృషి, వ్యాపారాదులు, పెద్దల దర్శనం, సర్వ ప్రయత్నసిద్ధి, స్త్రీ సహాయం, శుభం.

శని : ఏనుగుల వలన భయం, నల్లని వస్త్రలాభం, కోపం, పరపీడ, నీచభయం, దుర్వార్తాశ్రవణం, నీచకార్యాచరణము, బుద్ధి మాంద్యము, అనవసర ప్రసంగము, విరక్తి, గర్భశూల, గుండెపోటు. శాంతి:-రుద్రాభిషేకం, తైలాభిషేకం, శనిస్తుతి.

శుక్రుడు : తెల్లని బట్టను ధరించుట, పరిమళ ద్రవ్యోత యోగము, స్త్రీ సంభోగ సౌఖ్యం, నూతన పరిచయములు, స్థిరలాభం మధురపదార్థలాభం, ధనలాభం, స్త్రీ లాభం, గో లాభం, సర్వంసుఖం.

కుజుడు : అధికారుల బెడద, ఆయుధముల వలన భయము, కార్యనాశనం మనస్తాపం, మనో కాఠిన్యం, దక్షిణ, నైఋతి దిశప్రయాణం, ఔషధసేవ, ధనాలోచన, ధనమునకు యిబ్బంది, అకారణ విరోధం, రక్తదర్శనం, ఒత్తిడులు, పనులలో ఆటంకము, శాంతి:– శివునకు అభిషేకం, కుజస్తుతి.

* * *

# 1992-93 శ్రీ అంగిరానామ సంవత్సర మాసాధి పతులు

| నెం. | ఇంగ్లీషు తేదీలు | తెలుగు మాసములు | అశ్వినీ మఘ మూల | భరణి పుబ్బ పూ॥షా | కృత్తిక ఉత్తర ఉ॥షా | రోహిణి హస్త శ్రవణం | మృగ చిత్త ధనిష్ఠ | ఆర్ద్ర స్వాతి శతభిషం | పునర్వసు విశాఖ పూ॥భా | పుష్యమి అనూరాధ ఉ॥భా | ఆశ్రేష జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 4-4-92 | చైత్రం | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు |
| 2 | 3-5-92 | వైశాఖం | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు |
| 3 | 2-6-92 | జ్యేష్ఠం | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని |
| 4 | 1-7-92 | ఆషాఢం | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు |
| 5 | 30-7-92 | శ్రావణం | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు |
| 6 | 29-8-92 | భాద్రపదం | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు |
| 7 | 27-9-92 | ఆశ్వి | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు |
| 8 | 26-10-92 | కార్తీకం | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు |
| 9 | 25-11-92 | మార్గశిరం | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని |
| 10 | 24-12-92 | పుష్యం | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు |
| 11 | 23-1-93 | మాఘం | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు | చంద్రుడు | శుక్రుడు |
| 12 | 22-2-93 | ఫాల్గుణం | చంద్రుడు | శుక్రుడు | రవి | రాహువు | కేతువు | శని | కుజుడు | బుధుడు | గురుడు |

# శ్రీ అంగీర నామ సంవత్సర వ్రతదిన పట్టిక

| 1992-93 | శుక్లపక్షము | | | | కృష్ణపక్షము | | | | నక్షత్రములు | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మాసములు | ప్రతిపత్ | షష్ఠి | ఏకాదశి | ○ పూర్ణిమ | ప్రతిపత్ | ఏకాదశి | మాసశివరాత్రి | ● అమావాస్య | కృత్తిక | రోహిణి | ఆర్ద్ర | పునర్వసు | శ్రవణం |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| ఏప్రిల్ | 4 | 8 | 13 | 17 | 18 | 28 | -- | 3 | 6 | 7 | 9 | 10 | 25 |
| మే | 3 | 8 | 12 | 16 | 17 | 28 | 1,30 | 2 | 4,31 | 5 | 7 | 8 | 23 |
| జూన్ | 2 | 6 | 11 | 15 | 16 | 26 | 28 | 1 | 27 | 1,28 | 3,30 | 4 | 19 |
| జూలై | 1,30 | 5 | 10 | 14 | 15 | 26 | 28 | 29 | 25 | 26 | 28 | 129 | 16 |
| ఆగష్టు | 29 | 4 | 9 | 13 | 14 | 24 | 26 | 28 | 21 | 22 | 24 | 25 | 13 |
| సెప్టెంబరు | 27 | 2 | 7 | 11 | 13 | 22 | 25 | 26 | 17 | 18 | 20 | 21 | 9 |
| అక్టోబరు | 26 | 2,31 | 7 | 11 | 12 | 22 | 24 | 25 | 15 | 16 | 18 | 19 | 6 |
| నవంబరు | 25 | 30 | 6 | 10 | 11 | 20 | 22 | 24 | 11 | 12 | 14 | 15 | 2,30 |
| డిశంబరు | 24 | 30 | 5 | 9 | 10 | 20 | 22 | 23 | 8 | 9 | 11 | 12 | 27 |
| జనవరి 93 | 23 | 29 | 4 | 8 | 9 | 18 | 21 | 22 | 5 | 6 | 8 | 9 | 23 |
| ఫిబ్రవరి | 22 | 27 | 3 | 6 | 7 | 17 | 19 | 21 | 1,28 | 29 | 4 | 5 | 20 |
| మార్చి | 24 | -- | 4 | 8 | 9 | 18 | 21 | 22 | -- | 1 | 3 | 4 | 19 |

## వారశూలాలు

తూర్పునకు: మంగళవారం శుభము. శని సోమవారములు పనికిరావు 23 ఘడియలపై శూల దోషములేదు.

పశ్చిమము: బుధ గురువారములు శుభము. ఆదిత్య శుక్రవారములు దోషములు ఈ శూల దోషము 22 ఘడియల తరువాత లేదు.

ఉత్తరము: ఆదిత్య శుక్రవారములు శుభము. మంగళ బుధవారములు దోషము. ఈ దోషము 25 ఘడియలుతరువాత లేదు.

దక్షిణము: శని సోమవారములు శుభము గురువారము దోషము. ఈ శూలదోషము 22 ఘడియల తరువాత లేదు.

# ప్రశ్న ప్రకరణము

1. ప్రశ్న విషయము :- ప్రశ్నించిన వేళకు లగ్నము మేషమైనచో మానవవిషయము, వృషభమైన పశువిషయము, మిధునమైన ధన పరము, కటకమైన వ్యవహారము, సింహమైన రాజకీయము, కన్యయైన వధూ ప్రసక్తి, తుల యందు లోహ విషయం, మీనమైన ప్రయాణ విషయము, వృశ్చికమైన వ్యాధి, ధనుస్సయిన ధనపరము, మకరము మనోచింత, కుంభం గృహ విషయము మీనమయిన శరశుని తెలుప వలెను.

2. పనియగునా? కాదా? :- ప్రశ్నించినవేళకు లగ్నము మీన మిధున కన్యలైన శీఘ్రముగా పని యగును. తులా, కుంభ, వృషభములైన కార్యసాఫల్యము. మేష ధనుస్సింహము లందు కార్యాలస్యము, మకర వృశ్చిక కటకము లందు కార్య నాశనమని ఎరుగ వలెను.

3. పుట్టబోవునది స్త్రీ శిశువా? పురుష శిశువా? :- ప్రశ్న లగ్నం నుండి 9-5-7-3 స్థానములందు రవి కుజ గురులున్నచో పుత్రుడని, 2-4-6 స్థానములలో చంద్ర శుక్రులున్నచో పుత్రికయని, 2-4-6-8 స్థానములలో శని బుధు లున్నచో నపుంసకుడని చెప్పవలెను. లగ్నాత్తు చతుర్ధమున ఎన్ని గ్రహము లుండిన అందరు సంతానమని అనగా 2 వున్న కవలలని, 3 వున్న ముగ్గురని చెప్పుటకూడా కలదు.

4. మరియొక పద్ధతి :- గర్భిణీ స్త్రీ యొక్క నామాక్షరముల సంఖ్యను 7చే గుణించి దానికి ఆనాటి తిథి సంఖ్యను కలిపి, 9 చే భాగించవలెను. వచ్చిన శేషము సరి సంఖ్యయైన స్త్రీ శిశువని, బేసియైన పురుష శిశువని తెలియ వలెను.

5. ప్రయాణ లాభాలాభములు :- తన నీడ పల్ల కలిగిన పాదచ్ఛాయల సంఖ్యను 3చే గుణించి 13 కలిపి 8చే భాగించగా శేషం 1 అయిన ధనలాభం, 2 ధన నాశనం, 3-4-7 అయిన ప్రమాదం, 5-6 అయిన శుభం, 8-అయిన ప్రాణాపాయ మని చెప్పవలెను.

6. దేశాంతర మేగిన వారు ఎప్పుడు వత్తురు? :- ప్రశ్న లగ్నమున బుధ చంద్ర కేతువు లున్నచో తిరుగు మార్గ మందున్నాడని, గురు శుక్రులున్న చేరువకు చేరినాడు. ఒకటి రెండు నాళ్ళలో రాగలడని-కుజ రవులున్నచో ఇంకా అక్కడనే ఉన్నాడని, శని రాహువులున్నచో అనారోగ్యము వలన రాలేకపోయినాడని తెలియవలెను.

7. మరి యొక్క పద్ధతి :- ప్రశ్నించిన వానిని 27 అంకె లోపల ఒక అంకె చెప్పమని అది అశ్విన్యాది నక్షత్రములలో ఏ నక్షత్రమగునో చూచి-ఆర్ద్ర మొదలు ఆ నక్షత్రమువరకు లెక్కించి దానిని 7 భాగించగా శేషం 1 అయిన శీఘ్రముగా వచ్చునని, 2 అయిన అక్కడనే వున్నాడని, 3 అయిన యింటికి వచ్చుచున్నాడని, 4 సమీపమునకు చేరుకున్నాడని, 5 మార్గ మధ్య మందున్నాడని, 6 జబ్బుపడి యున్నాడని, 7 మృత్యు గతమని తెలియ వలెను.

8. నష్టద్రవ్య ప్రశ్న :- కేంద్ర, త్రికోణ, అష్టమ, ధన (4,7,10,11,9,8,2) స్థానములందు శుభ గ్రహ సంబంధము లేనిచో, పాప గ్రహ సంబంధముతోయున్న పాపు లున్న యెడల పోయిన సొమ్ము దొరకదనియు, ఆ ప్రయత్నమందు మరికొంత ద్రవ్యము

ఖర్చు అగునేగాని ప్రయోజన ముండదని తెలుపవలెను. మరియు 1,5,9,2,3,10,11 స్థానములలో శుభ గ్రహములు బలవంతులై యుండగా 1,5,9,4,7,10,8,11 స్థానములలో పాప గ్రహములు లేని యెడల-పోయిన సొమ్ము తిరిగి దొరుకునని చెప్ప వలెను.

9. నక్షత్రమును బట్టి చోర ప్రశ్న :- 1. రోహిణి, పుష్యమి, ఉత్తర, విశాఖ, పూర్వా షాఢ, ధనిష్ఠ, రేవతి-అను యీ 7ను అంధక నక్షత్రము లనబడును. ఈ తారల యందు దొంగిలింప బడిన వస్తువులు తిరిగి లంభించునని చెప్పబడినది. 2. మృగశిర, ఆశ్రేష, హస్త, అనూరాధ, ఉత్తరాషాఢ, శతభిషం, అశ్విని-ఇవి 7ను మందాక్షము లనబడును. ఈ తారలలో పోయిన సొమ్ము కొంచెము ప్రయత్నముపై లభించును. 3. ఆర్ద్ర, మఖ, చిత్త, జ్యేష్ఠ, అభిజిత్, పూర్వాషాఢ, భరణి-ఈ 7ను మధ్యమములు. ఈ తారలందు పోయినవి తిరిగి లభించుట కష్టం. మిక్కిలి ప్రయాసముపై లభించిన లభించ వచ్చును. 4. పున, పుబ్బ, స్వాతి, మూల, శ్రవణం, ఉత్తరాభాద్ర, కృత్తిక ఈ 7ను సులోచనము లనబడును. ఈ తారలలో పోయినవస్తువులు తిరిగి దొరుకుట అరుదు అని-రత్నమాలావచనము.

10. ఉద్యోగ ప్రశ్న :- ప్రశ్న లగ్నమునకు 7, 10 స్థానములలో శుభ గ్రహములున్నను-లేదా-శుభగ్రహ వీక్షణ మున్నను త్వరలో ఉద్యోగము లభించునని చెప్పవలెను.

## వివాహ ప్రకరణము

1. వివాహమునకు తగినవయస్సు :- పురుషునకు 21వ సం॥ నుండి తరువరి వేసి సంవత్సరములు, కన్యకు 18వ సం॥రం నుండి పరిసంవత్సరములందునా వివాహమునకు యుక్త వయస్సుగా చెప్పబడినది.

2. వధూవరులకు చూడవలసిన నాడీకూటమి:- అశ్విని మొదలు మూడువ్రేళ్ళయందు మూడేసి చొప్పున లెక్కించగా వధూవరులకు నక్షత్రములు ఒకే వ్రేలిపై కిరారాదు. వచ్చినచో అశుభ ముందురు.

3. రాశికూటము:- వధువు జన్మరాశి మొదలు-వరుని జన్మరాశి వరకు గణించగా-వరుని రాశి 7వ దైన శుభము, వధూవరుల రాశులు రెండూ ఒకటి అయిన శుభము. వధువురాశికి వరునిరాశి 3,4,5,10,11 యగుట-వరునిరాశికి వధువురాశి 3,4,9,10,11 యగుట శుభము.

4. గ్రహమైత్రి :- వధూవరుల జన్మరాశ్యాధిపతులు ఒకరే అయినను, మిత్ర అధిమిత్రపనములైనను శుభము. శత్రువులైన అశుభము.

5. స్త్రీ దీర్ఘ కూటము :- వధువు నక్షత్రము నుండి 27 నక్షత్రములను 3 నవకముల క్రింద తొమ్మిదేసి చొప్పున వేసుకొనవలెను. అందు వరుని నక్షత్రము మొదటి నవకములో

---

11. పెండ్లి ఎప్పుడు జరుగును :- ప్రశ్న లగ్నము మేషము లగాయితు సమరాశు లందుండి, శుక్రుడు సమ రాశులలో యున్నచో త్వరలోనే పెండ్లి జరుగునని చెప్ప వలెను.

పడినచో కలహము. రెండవ నవకమందైన సామాన్యము. 3వ నవకమైన శుభము. వధువు యొక్క నక్షత్రమునకు 13 నక్షత్రములపైన పురుష నక్షత్రమున్నచో శుభమేనని కొందరు చెప్పియున్నారు.

6. గణకూటము :- అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, స్వాతి, అనురాధ, శ్రవణం, రేవతి. ఇవి దేవ గణములు. భరణి, రోహిణి, ఆరుద్ర, పుబ్బ, ఉత్తర పూర్వాషాఢ, ఉత్తరాషాఢ పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర-ఇవి మనుష్యగణములు. కృత్తిక, ఆశ్లేష, మఖ, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, మూల, ధనిష్ఠ, శతభిషం-ఇవి రాక్షస గణములు. వధూవరుల నక్షత్రములు ఒకే గణమందుండినచో మంచిది. వరుని నక్షత్రము దేవగణము, వధువుతార మానవ గణమైనను మంచిదే. వధువు తార రాక్షస గణమై వరుని తార ఇతర గణములందున్నచో ఆ సంసారము కష్టతరము.

* ఈ పొంతనములు మేనరికము విషయములో చూడనక్కరలేదు.

7. త్రిజ్యేష్ఠ:- వివాహమున వధూ వరులకు త్రిజ్యేష్ఠ శబ్దము రాకూడదు. అనగా వధూ వరులిరువురను జ్యేష్ఠ సంతానములై జ్యేష్ఠ మాసముగాని, జ్యేష్ఠా నక్షత్రముగాని కారాదు. అట్లే ఇరువురకు జ్యేష్ఠ జన్మనక్షత్రమై ఒకరు జ్యేష్ఠులైనచో త్రిజ్యేష్ఠ యగును. ఒకరి జన్మతార జ్యేష్ఠయై, ఇరువురును జ్యేష్ఠ జన్ములైన అదియు త్రిజ్యేష్ఠయే. అట్లే ఒక జన్మతార జ్యేష్ఠయై, మరొకరు జ్యేష్ఠులై, జ్యేష్ఠమాసమైననూ త్రిజ్యేష్ఠయే, ఈ విధముగా చూచుకొని-త్రిజ్యేష్ఠను తప్పనిసరిగా వదలివేయవలెను. జ్యేష్ఠులనగా స్త్రీ పురుష సంతానములలో తొలివారిగా లెక్కించవలెను. వీరికన్న ముందరివారు యెవరైనను మృతులైనచో-బ్రతికినవారిలో జ్యేష్ఠులుగా లెక్కించరాదు.

8. వధూవరులకు కుజదోషము :- వధూవరులు ఇద్దరి జాతక మందును లగ్నమునుండియు, చంద్రుని నుండియు, శుక్రుని నుండియు 1-2-4-7-8-12 స్థానములలో అంగారకుడు వున్నచో ఆ దంపతులు దీర్ఘ కాలము సుఖించెదరు. సత్సంతానములు కల్గియుందురు. కావున-కుజదోషముగల వరునకు కుజదోషముగల కన్యనిచ్చి పెండ్లి చేసినచో శుభమగును. అట్లుగాక, ఒక జాతకమున కుజదోషముండి, మరియొకరి జాతకము కుజదోషము లేనిదైనచో ఆ దాంపత్యము వర్ధిల్లదు. పుత్రనాశనము, మరణభయము కల్గును.

9. పెండ్లిముహూర్తముకు కుజాష్టమ దోషం :- వధూవరు లిరువురకు కుజదోషమున్న శుభమే గాని- వివాహ ముహూర్తమునకు మాత్రము కుజుడు అష్టమ మందుండరాదు. ఆ ముహూర్తము నిషిద్ధం.

10. భృగుషట్క దోషం :- ముహూర్తమునకు 6వ యింట శుక్రుడుండరాదు. అది దాంపత్య భంగకరమని తెలియవలెను.

11. సగ్రహ చంద్రదోషం :- చంద్రు డితర గ్రహములు వేనితోనూ కల్సియుండరాదు. ఏలననగా-ముహూర్త సమయమునకు చంద్రుడు రవితో కలిసినచో దరిద్రము, కుజగ కూడిన మృత్యుభీతి, బుధసంబంధీకుడైన సంతానహీనతా, కష్టములు, గురుసంయోగమున ధననష్టాదులు, శుక్ర సంపర్కంవల్ల భార్యా విరోధము, ఎడబాటు, శనితో

కలయిక వలన దరిద్రము కలుగును. అందుచే చంద్రుడు ఏ గ్రహముతోటి కలవకుండునట్లు చూడవలెను.

12. జామిత్రస్థానం :- ముహూర్త లగ్నమునకు సప్తమస్థానము శుద్ధిగాయుండవలెను. వివాహముహూర్తమునకిది అత్యంత ప్రధానం.

13. పాప షడ్వర్గు :- లగ్న, హోర, ద్రేక్కాణ, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశాధిపతులు-శుభ గ్రహయుతులైగాని, శుభస్థానములందుగాని యుండవలెను. పాపస్పర్శ మహా దోషము.

14. రిష్ఫచంద్ర దోషం :- వివాహ ముహూర్త లగ్నమునకు 1-6-8-12 స్థానములలో చంద్రుడున్నచో అది చెరుపు చేయును.

15. శుభతిథులు :- ఉభయపక్షము లందలి 2,3,7,10 తిథులును. శుక్ల 11,12,13,15 బ. పాడ్యమి తిథులను శ్రేష్ఠములు. ఉభయపక్షములలోని 4,6 తిథులు-శుక్ల 8-9 తిథులు రెండవ మతము.

16. శుభవారములు :- బుధ గురుశుక్రవారములు శ్రేష్ఠము. తప్పని సరియైనప్పుడు శని, ఆదివారములు కూడా అంగీకరింపబడుచున్నవి. మంగళవారము నిషిద్ధము దూష్యము. సోమవారము పునర్వివాహము ప్రదము. కావున సోమ, మంగళ వారములలో పెండ్లి తలపెట్టరాదు.

17. శుభతారలు : రోహిణి, మృగ, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర, రేవతి-ఈ పదకొండు తారలూ శ్రేష్ఠమైనవి. వీటికి పాపగ్రహ సంబంధము లేకుండా చూసుకొని ముహూర్తము నిర్ణయించుకొనవలెను. జన్మ తారకు పదియవతార కర్మతార అనబడును. ఆ తారలో పెండ్లి జరపరాదు. పై నక్షత్రములలో, ఏవైనా వధూవరులకు కర్మతారలైనచో ఆ నక్షత్రములు ఎంత గొప్పవైనను పనికి రానివని తెలియ వలెను.

18. నిషిద్ధములు :- పుట్టినతిథికి 30వతిథి నాడును. జన్మమాసమునకు ఎనిమిదవ మాసమందును, జన్మరాశికి 8వ రాశియందును, జననలగ్న రాశికి 8వ రాశియందును వివాహము చేయరాదు. సూర్యుడు మీన మందున్న చైత్ర మాసములోను, మిథున మందున్న ఆషాఢములోను, కన్యయందున్న భాద్రపదములోను, ధనుస్సు నందున్న పుష్య మాస మందును పెండ్లి చేయరాదు.

# గృహవాస్తు సంప్రదాయములు

## వాస్తు పురుష స్థితి

వాస్తుపురుషుడు-భాద్రపద, ఆశ్వయుజ, కార్తీకమాసములలో తూర్పు శిరస్సుగను, మార్గశిర, పుష్య, మాఘములలో దక్షిమున శిరస్సుపెట్టి కాళ్లు ఉత్తరమున బెట్టియు, ఫాల్గుణ, చైత్ర, వైశాఖములలో పడమర శిరస్సును, తూర్పున కాళ్లనుబెట్టియు, జ్యేష్ఠ, ఆషాఢ, శ్రావణ

ములలో ఉత్తరమున శిరస్సు బెట్టియు-ప్రక్కకు ఒదిగి తల క్రిందచేయిబెట్టి పరుండును. కాన, ఆ మాసములలో వాస్తుపురుషుని దృష్టికి ఎదురుగను పాదములున్న దిక్కులందును గృహం నిర్మించరాదు.

## గృహ నిర్మాణమునకు మాసములు

చైత్రమున శుభము, వైశాఖము సంపద, జ్యేష్ఠమున్మృత్యు ప్రదము, ఆషాఢమున సిరిసంపదలు నశించును, శ్రావణమున శుభము, భాద్రపదమున రోగభయము, ఆశ్వయుజమున కలహములు, కార్తీకమున ధనయోగము, మార్గశిరమున ధాన్యము, పుష్యము చోర, అగ్ని ప్రమాదముల భయం, మాఘం వంశాభివృద్ధి, ఫాల్గుణం ధనలాభం.

## శంఖు స్థాపన

కుటుంబములో వివాహము జరిగిన సంవత్సరములోపలను, భార్య గర్భవతిగ యున్నప్పుడు ఆరు మాసముల లోపల గృహ నిర్మాణము చేయరాదు. దేవుని పూజా మందిరము ఈశాన్యములో తూర్పు గోడకుచేర్చి యుంచవలయును. అనగా పూజ చేయుటకు కూర్చుండు వారి ముఖము తూర్పుదిక్కుగ ఉండవలయును. వంట ఆగ్నేయములో తూర్పు గోడకు చేర్చి వంట చేయువారి ముఖము తూర్పును చూచునట్లుండవలయును. మరుగుదొడ్లు ఆగ్నేయ, నైరుతి వాయవ్యములలో వీలునుబట్టి యేర్పరచుకొనవలెను.

ధాన్యపుగాదులు ఉత్తరదిక్కున ఉండవలయును. వాటిప్రవేశ ద్వారములు దక్షిణమును చూచునట్లుండవలయును. ఈశాన్యములో మరుగుదొడ్లు పెట్టరాదు. ఏ స్థలమునకైనను ఉత్తర, ఈశాన్య, తూర్పుల నుండి నీరు బయటకుపోవునట్లు తూములు పెట్టుకొనుట మంచిది. ఆ విధముగ వీలు లేనప్పుడు అగ్నేయ, వాయవ్యమూలల నుండి నీరు బయటకు పోవునట్లు పెట్టుకొనుట మంచిది.

గృహము నిర్మించు స్థలము చతురస్రముగ గాని, దీర్ఘచతురస్రముగ గాని యుండవలయును. చతురస్రములో నాలుగు దిక్కుల కొలతలు సమానముగా యుండును. దీర్ఘ చతురస్రములో ఎదుటి భుజములు మాత్రమే సమానమైన కొలతలు కలిగియుండును.

నైరుతిమూలనుండి నీరు బయటకుపోవునట్లు తూములు పెట్టరాదు. నీటివాటములు స్థలములకు మాత్రమే చెప్పబడినవి. ఇండ్లలో యీ విధులు పాటించనవసరము లేదు. యింటిలో యుండు గదులను బట్టి నీటివాటములు యేర్పరచుకొనవచ్చును.

సింహద్వారమునకు రెండువైపుల కిటికీలు ఉండవలయును. ఇంటిద్వారములు మూయునప్పుడు తెరచునప్పుడు ధ్వనికలుగరాదు. ఎత్తు తక్కువయిల్లు కుట్ర గృహమనబడును. అందు నివసించరాదు.

గృహమును కట్టదలచిన స్థలము తూర్పు, ఉత్తరములలో ఎత్తుగయుండి పశ్చిమ, దక్షిణములు పల్లముగ యున్నచో "ఉచ్చవేధ" వచ్చును. ఇది శుభప్రదముకాదు. దక్షిణ, పశ్చిమములు ఎత్తుగాయుండుట మంచిది.

కిటికీలులేని గృహము "అంధకవేధ" కలదియగును, కొబ్బరి, అరటి, దానిమ్మచెట్లు ఉన్న గృహము సర్వదావృద్ధి పొందుచుండును.

పశ్చిమ, ఉత్తరదిక్కులకు శిరస్సు పెట్టి నిద్రించరాదు. దిగంబరుడుగ శయనించరాదు. దిగంబరుడుగా స్త్రీ సంభోగము చేయరాదు. తడికాళ్ళతో శయనించరాదు.

అన్నదమ్ములు ఒక గృహమును పంచుకొని, అందు నివసించునప్పుడు పెద్దవారు దక్షిణ, పశ్చిమ దిశలలోను, చిన్నవారు తూర్పు, ఉత్తర భాగములలోను యుండుట శుభము.

భోజనము - తూర్పు లేక ఉత్తరదిశలను చూచుచు కూర్చుండి భోజనము చేయుట శుభప్రదము.

వసారాలు-వసారాలు కట్టదలచినచో దక్షిణపుగోడమీద ఎత్తు ఉంచి చూరు ఉత్తరదిశకు దిగునట్లు కట్టవలయును. పడమరదిశలో వసారా వేయునప్పుడు, తూర్పునకు వాలు పెట్టి కట్టవలయును.

తన గృహమునకుచేర్చి తూర్పు, ఉత్తర, ఈశాన్యములలోయున్న స్థలములను కలుపుకొనవచ్చును. దక్షిణదిశయందుండు స్థలములనుకొని, తన స్థలమునకు కలుపుకొనరాదు. తనగృహమునకు ఈశాన్యములో మట్టిదిబ్బలు, గుట్టలు, పేడకుప్పలు, మరుగుదొడ్లు ఉండరాదు. అట్లున్నచో కష్టనష్టములు కలుగుచుండును.

వాస్తుపురుషునకు సింహద్వారము ముఖము అగును. సింహద్వారమునుబట్టి, ఆ యిల్లు తూర్పు యిల్లు, దక్షిణపు యిల్లు, పడమర యిల్లు, ఉత్తరము యిల్లు అని చెప్పబడును.

1. తూర్పు యిల్లు – పడమరద్వారము పెట్టి, ముఖము తూర్పుగపెట్టి లోనికి ప్రవేశించునది ఇది తూర్పుయిల్లు అగును. కార్తీక, మాఘమాసములలో కట్టుకొనవలయును. శ-అ-క వర్గుల వారికి అర్హణము.

2. దక్షిణపు యిల్లు-ఉత్తరమున సింహద్వారము పెట్టి, దక్షిణముగ ముఖము పెట్టి లోనికి ప్రవేశించుచున్నచో, అది దక్షిణపుయిల్లు అనబడును. చ-ట-త-ప వర్గులవారికి అర్హణము. మాఘ, ఫాల్గుణ, వైశాఖములలో కట్టవలయును.

3. పడమర యిల్లు :– తూర్పున సింహద్వారముపెట్టి, పడమర దిశగ ముఖముపెట్టి లోనికి ప్రవేశించునది పడమరయిల్లు. ఫాల్గుణ, వైశాఖ, శ్రావణమాసములలో నిర్మించుట శుభప్రదము. ట త, ప, వర్గులవారికి శ్రేష్ఠము.

4. ఉత్తరపు యిల్లు :– దక్షిణమున సింహద్వారముపెట్టి, ఉత్తరముఖము లోనికి ప్రవేశించునది ఉత్తరపు యిల్లు. శ్రావణ, కార్తీక మాసములలో కట్టవలయును. వ యు-శ వర్గులవారికి అర్హణము.

గృహముకట్టువారి పేరులో మొదటి అక్షరము అ, క, చ, ట, త, ప, యు, శ అను ఎనిమిది వర్గులలో ఏ వర్గునకు చెందినదో ఆ వర్గు స్వస్థానమగును. దానికి 5వ, వర్గు శత్రుస్థానమగును. ఆశత్రుస్థానములో గృహనిర్మాణము చేయరాదు. అర్హణము కాని వర్గులకు సంబంధించిన స్థలములలో గృహనిర్మాణము చేసి, అందు నివసించినచో, సదా కష్టనష్టములు కలుగుచుండును.

**వంటకు** ప్రతిగృహమునకు ఆగ్నేయ గదిలో తూర్పుగ ఆగ్నేయము మూల వంట చేయవలెను. తూర్పుముఖముగ కుడుము ఉండాలి. లేనియెడల ఆగ్నేయము కుదరనిచో నైఋతి గదిలో ఆగ్నేయము మూల మంచిది.

## స్థలములు పెరిగిన దిశల ఫలములు

| దిశ | పెరిగినచో ఫలము | తరిగినచో ఫలము |
|---|---|---|
| ఈశాన్యం | ఉత్తరదిశకు పెరిగిన ధనవృద్ధి, తూర్పుకు పెరిగిన ధనంతో బాటుధర్మబుద్ధి ప్రతిష్ట. ఎటు పెరిగినా సిరిసంపద. | పురుష సంతానం లేకుండుట, ఆయుశ్శంక, సంపాదనకు మించిన ఖర్చులు, చిక్కులు,చికాకులు |
| తూర్పు | ధనవృద్ధి,ఆయుర్వృద్ధి ప్రయోజకులైన పురుషసంతతి. | పురుష సంతతిలోపం, వేధ, అంగవైకల్యం, **కీర్తి నష్టము** |
| ఆగ్నేయం | తూర్పుకునిర్వంశత, ఆగ్నేయం కలహాలు. దక్షిణంకీడు. | శుభం, ఒక పరిమితిలో సన్మానం,స్నేహం, ధైర్యం |
| దక్షిణం | ఆర్థికనష్టం, స్త్రీ హాని, తగవులు. | స్త్రీలకు శుభం. ఈ దిశ ప్రభావం స్త్రీలపై ఎక్కువ. |
| నైఋతి | శత్రు,రోగ,ఋణబాధలు, దక్షిణపు వైపుపెరిగితే స్త్రీలకు పశ్చిమంలోనైతే పురుషులకు అకాలమరణ ప్రమాదం. | సంతాన వృద్ధి, సుఖశాంతులు. |
| పశ్చిమము | పెరగకపోవడమే శ్రేయం. పెరిగితే చెట్లు పెంచడం మంచిది. ఈదిక్కు ప్రభావము మగసంతతిపై ఎక్కువ. | ఈదిశ సమానంగా వుండాలి అది గృహ స్థలాన్ని బట్టి జాగ్రత్తగాచూచు కోవాలి. |
| వాయవ్యం | అశాంతి.ఋణబాధలు, అధిక ఖర్చులు, సంతాన నష్టం. | ధన గౌరవములు, మనశ్శాంతి సుఖ సంతోషములు. |
| ఉత్తరం | అష్టయిశ్వర్యములు, సర్వశుభములు. ఉత్తరం తూర్పు ఖాళీస్థలం ఎక్కువ కలిగి వీటిపై ప్రహారిగోడ అలాగే పశ్చిమ సింహద్వారం ఉంచి, ఆగ్నేయం వంటగది ఏర్పర్చిన (దక్షిణం ఎక్కువైతే మంచిది) న్యాయశీలురు, భాగ్యవంతులు, మేధావంతులు అవుతారు. | గృహం పరులపాలవును, కీడు, చిక్కులు, కలహాలు, ఉత్తర ముఖద్వారం గల ఇంట తూర్పున ఖాళీ స్థలం తక్కువై అలాగే దక్షిణదిశ కాళీస్థలం ఈరెంటికన్న ఎక్కువై వున్నచో ఆఇల్లు వేలం లేక బాకీలరూపంలో శీఘ్రమే పరాధీనమగును, యజమానులు కూడా మారుతుంటారు. |

## ఎనిమిది దిక్కులా ఎత్తు పల్లముల వలన ఫలములు

| దిశ | ఎత్తుగా వున్న ఫలములు | పల్లముగానున్న ఫలములు |
|---|---|---|
| తూర్పు | సంతానమునకు తీవ్రహాని | ఆయుర్వృద్ధి, సిరిసంపదలు మంచికీర్తి |
| ఆగ్నేయము | వాయవ్య ఈశాన్యముల కంటే ఎత్తుగా నున్నచో ధన లాభము,నైఋతికన్న ఎత్తయినచో అశుభము | వాయవ్య ఈశాన్యముల కన్న పల్లమైనచో దుష్ట ప్రవృత్తి, అగ్నిశత్రు భయము, పుత్ర సంతానారిష్టము. |
| దక్షిణము | పుష్టితుష్టి ఆరోగ్యం, ఆర్థికంగా ఆధిక్యత | దరిద్రము -వ్యాధులూ. |
| నైఋతి | పరువుప్రతిష్టలు ధనవృద్ధి | దీర్ఘవ్యాధులు,దుర్మరణములు, **దుర్వ్యసనములు** |
| పడమర | సంతానవృద్ధి,ప్రతిష్ఠ- పలుకుబడి పెరుగుట | ధననష్టం,సంతాన నష్టం. |
| వాయవ్యం | ఈశాన్యముకన్నఎత్తయిన ధనప్రాప్తి,వ్యవహార జయము. నైఋతి ఆగ్నేయములకన్న ఎత్తైన అశుభం. | ఈశాన్యముకన్న పల్లమైన వ్యాధులు, బాధలు, కలహాలు, నైఋతి, ఆగ్నేయములకన్న పల్లమైన శుభం. |
| ఉత్తరం | కష్టపరంపర, అరిష్టములు, మిక్కిలి అశుభము | సర్వత్రా విశేష శుభప్రదం. |
| ఈశాన్యము | అష్టకష్టములు- అతి దరిద్రములు, పెంటకుప్పలు దిబ్బలు,గుట్టలు,పందిళ్లు, పాకలు, పాయిఖానా దొడ్లు, వంటగదులు, గుండ్రని ప్రహారి గోడలతో స్థలం ఆక్రమించినా, ఎత్తైన అష్టకష్టములు-దరిద్రములు-ప్రమాద సూచకం, పీడ,పీడ. | నిత్య సుఖ సంతోషములు- అష్టయిశ్వర్య ప్రాప్తి, ఈశాన్యపు తూర్పువాలు మగవారికి, ఉత్తరముగా వసారాలు వాలిన స్త్రీలకు సమస్తసత్ఫలితాలు కలిగిస్తాయి. నూతులు, కాలువలు, గోతులు, స్థలవైశాల్యము గృహములలో స్థలవ్యాప్తి, వాడకపు నీరు పారుట వలన ఆర్థికపుష్టి, సర్వ సౌభాగ్యదాయకము. |

శ్రీ

# వర్ష యోగములు

**చైత్రమాసము:** ఇందు రవ్యాది గ్రహములన్నిటికీ సౌమ్య, రస, జల, అమృత నాడీ సంచారము గలదు. శుద్ధ ౧ నుండి సప్తమి వరకు బుధో వక్రీ ఋజుశ్శుక్రుడు. శు ౧౧ వరకు పురోబుధుడు. బ. ౧౦ అంగారక చలనము గలవు. శుద్ధమున మేఘాడంబరత కల్గి ఖండవృష్టి, బహుళమున అనావృష్టి కల్గును. చాంద్ర యోగములచే ఏప్రిల్ 11,12,13,18,19,25, 26,27 తేదీలలో వర్ష సూచనలుండును.

**వైశాఖమాసము:** ఇందు రవి బుధ శుక్రులకు వాయు, మహావాయు నాడియందును కుజ, గురు, శనులకు సౌమ్య అమృత దహన నాడీ యందును సంచారము గలదు. శు. ౧౦ శుక్రాస్తమయము. శు. ౪ ల || బ. ౪ వరకు బుధశుక్రసమాగమము. బ. ౨ల|| బుధశుక్ర సమాగమము గలవు. బ. ౧౨ శని వక్రారంభము గలదు. ఈ మాసము గాలి దుమారములు కల్గి ఎండలు మెండుగా కాయును. వడగాల్పులధికము. మేఘాడంబరములు హెచ్చు. చాంద్ర యోగములచే మే 5,6,8,9,13,14,15,23,24,29 తేదీలలో ఖండ వృష్టి కల్గును.

**జ్యేష్ఠ మాసము:** ఇందు గురు శనులకు అమృత జలనాడులందును. మిగిలిన గ్రహములకు దహన, వాయు, సౌమ్య నాడీ సంచారము గలదు. శు. ౬ అంగారక చలనము. శు. ౬ వరకు బుధ శుక్ర సమాగమము. శు. ౧౪ల|| బ. ౭ వరకు బుధ శుక్ర సమాగమము. బ. ౭ల|| పురోబుధుడు. శుద్ధమున అనావృష్టి. బహుళమున స్వల్పవృష్టి కల్గును. చాంద్ర యోగములచే జూన్ 2,5,6,7,11,12,16,17,19,20,25,28 తేదీలలో వర్ష, సూచనలు కల్గును.

**ఆషాఢ మాసము:** ఇందు కుజ రాహువులకు మహావాయు దహన నాడీ యందును మిగిలిన గ్రహములకు రస, జల, అమృత నాడులందును సంచారము గలదు. బ. 3 అంగారక చలనము. బ. ౨ శుక్రోదయము. బ. ౨ల|| రవి శని సమసప్తకము గలవు. శుద్ధమున స్వల్ప వృష్టి, బహుళమున అధిక వర్షములు కురియును. చాంద్ర యోగములచే జూలై 2,3,4,8,9,13,14,16,17,25,26 తేదీలలో మంచి వర్షములు కురియును.

**శ్రావణ మాసము:** ఇందు కుజరాహువులకు మహావాయు దహన నాడులందును మిగిలిన గ్రహములకు అమృత రస, జల నాడీ సంచారముగలదు. శు.౪ల|| ప్రాగ్దిశిమఘాది పంచక శుక్రుడు శు.౪వరకు బుధోవక్రీ ఋజుశ్శుక్రుడును, బ. ౮ల|| మృగశిరా కుజుడు బ. 3ల|| పురోగురుడు. బ. 3 వరకు రవి శని సమసప్తకముగలవు. శుద్ధమున అధిక వర్షములు, నల్లని కారు మబ్బులు, బహుళమున మేఘ ప్రాబల్యముతో స్వల్ప వృష్టియు కల్గును. చాంద్ర యోగములచే జూలై 30,31, ఆగష్టు 4 నుండి 8,12,13,19,20, 21,26,27 తేదీలలో వర్షములు కురియును.

**భాద్రపద మాసము:** ఇందు కుజరాహువులకు దహన, సౌమ్యనాడీయందును, మిగిలిన గ్రహములకు రస, అమృత, సౌమ్య నాడీయందును సంచారము గలదు. శు ౫ అంగారక చలనము. శు.౮ గుర్వస్తమయము బ. ౮ల|| పురశ్చుక్రుడు. బ. 3ల|| 5 వరకు బుధ శుక్రసమాగమము. బ. ౧౪ల|| ప్రాగ్దిశిమఘాదిపంచక శుక్రుడు గలవు. శుద్ధమున స్వల్ప వృష్టియు, బహుళమున అధిక వర్షములు కల్గును. చాంద్ర యోగములచే సెప్టెంబరు 1 2,4,6,7,10,11,15,18,19 తేదీలలో వర్షములు కురియును.

**అశ్వయుజ మాసము:** ఇందు బుధ శుక్ర రాహువులకు వాయు, దహన నాడులందును మిగిలిన గ్రహములకు సౌమ్య, రస, నాడీయందును సంచారము గలదు. శు. ౫ గురూదయము బ. ౬ల|| మరలపురుశ్చుక్రుడు. శు. ౭ల|| బ. 3 వరకు పురోబుధుడు శు. ౬ల|| బ. ౭ వరకు పురశ్చుక్రరవి మధ్యమము గలవు. మాసమంతయు మబ్బుల మేఘాడంబరము స్వల్ప వర్షములు. బహుళ ౭ల|| గాలితో కూడిన వర్షములు. గాలి మిశ్రితములై వుండును. పశ్చిమ ప్రాంతములందు తుఫానులు కల్గును. చాంద్రయోగ ములచే సెప్టెంబరు 28, అక్టోబరు 1,3,4,11,12,16,17,19,21 తేదీలలో గాలితో కూడిన వర్షములు. తుఫానులు కల్గును.

**కార్తీక మాసము:** ఇందు రవి శుక్ర, బుధ, రాహులకు మహా వాయు, వాయు, దహన నాడీయందును మిగిలిన గ్రహములకు రస, జల, అమృత సంచారము గలదు. శుద్ధమున బుధ శుక్ర సమాగమము. పురశ్చుక్రుడు. శు. ౯ల|| కుజ శని సమసప్తకము గలదు శుద్ధమున వాయు మిశ్రిత ఖండవృష్టి, బహుళమున వాయుమిశ్రిత ఖండవృష్టి కల్గును చాంద్ర యోగములచే అక్టోబరు 28,29 నవంబరు 2,3,7,8,9,16,17,20,21 తేదీలలో వర్షములుండును.

**మార్గశిర మాసము:** ఇందు బుధ రాహువులకు మహావాయు, వాయు నాడి యందున మిగిలిన గ్రహములకు జల, రస, సౌమ్య నాడీ యందును సంచారము గలదు. శు ౯ వరకు పురశ్చుక్రుడు బ. ౬ల|| మరల పురశ్చుక్ర రవిమధ్యమము. బ. ౧౪ల| మిధునే వక్రీ కుజుడు మున్నగు సంచారములు గలవు. శు. ౨ ప్రాంతమున వాయు మిశ్రిత వృష్టి కల్గును. చాంద్ర యోగములచే నవంబరు 26,27,28 డిశెంబరు 1,2,4,5,11,12,13,14,18,19 తేదీలలో ఆకస్మిక వర్ష సూచనలు కల్గును.

**పుష్య మాసము:** ఇందు బుధ రాహువులకు వాయు, దహన నాడీయందును, మిగిలిన గ్రహములకు సౌమ్య రస, జల, అమృత నాడీయందును సంచారము గలదు. శు. ౫ వరకు పురశ్చుక్రుడు, బ. ౭ల|| మరల పురశ్చుక్రుడు. బ. ౭ల|| రవి శని సమాగమము పురశ్చుక్ర రవి మధ్యమము గలవు. మాసమంతయు మేఘాడంబరము. అనావృష్టి అమాప్రాంతమున ఖండ వృష్టి కల్గును. చాంద్ర యోగములచే డిశెంబరు 27,28,30 జనవరి 3,4, 7,8,14,15 తేదీలలో ఆకస్మిక వర్ష సూచనలు కల్గును.

**మాఘ మాసము:** ఇందు రాహు కేతువులుకాక మిగిలిన గ్రహములకు అమృత, రస, జల, సౌమ్య నాడీ సంచారము గలదు. శు. ౪ వరకు పురశ్చ్కురుడు. బ. ౬ల మరల పురశ్చ్కురుడు. రవి శని సమాగమము. గురుశుక్ర సమాగమము గలవు. అమా ప్రాంత మున ఖండవృష్టియు, మాసమంతయు మేఘాడంబరత గల్గును. చాంద్ర యోగములచే జనవరి 23,24, 25, ఫిబ్రవరి 1,2,6,7,10,13,14,16,17 తేదీలలో ఆకస్మిక వర్ష సూచనలు కల్గును.

**ఫాల్గుణ మాసము:** ఇందు రవి శుక్ర రాహువు కేతువులకు సౌమ్య, రస, జల అమృత నాడీలయందు సంచారము గలదు. శు. ౧౨ శని చలనము. బ. ౭ వరకు పురశ్చ్కురుడు. శు. ౪ల॥ బుధ శుక్ర సమాగమము. బ. ౭ వరకు రవి శని సమాగమము. మాసమంతయు గురుశుక్ర సమాగమము గలదు. పూర్ణిమ ప్రాంతమున ఖండవృష్టి మేఘప్రాబల్యముతో వుండును. చాంద్ర యోగములచే ఫిబ్రవరి 22,23, మార్చి 2,3,4,5,12,13,16, 17,19,21 తేదీలలో ఖండవృష్టి కల్గును.

## అర్ఘ యోగములు

**చైత్రమాసము:** ఈ మాసము శు. ౧౧ వరకు ధాన్యాదులకు, తైలములు, తేనె, ఆకులు, మూల వస్తువులు ధర పెరుగును. శు. ౧౧ల॥ నువ్వులు, వస్త్రములు, నూలు, దూది, కుంకుమాదులకు ధర హెచ్చును. బెల్లము, శర్కర, తేనె ధరనిలబాటు. మాసమంతయు బంగారము, వెండి, రాగి, పశువులు, దారములు ధర హెచ్చును. మత్స్యములు, రత్నములు, తైలాదులు ధర హెచ్చును.

**వైశాఖమాసము:** శు. ౧ల॥ మూలజాతి వస్తువులు, ఓషధులు, దేవదారు, సర్వధాన్యములు, శ్రీఫలము, మిర్చి ధర పెరుగును. శు. ౮ వరకు ధాన్యములు, కొబ్బరి యాలకులు ధర నిలబాటు. శు. ౧౧ల॥ దూది నువ్వులు, నూలు, తిలలు, పొట్టు ధాన్యములు, వేరుశనగ ధర అధికమగును. బహుళమున ధరలు కొద్దిగ పెరుగును. జీల కర్ర, కంబళ్ళకు మాసాంతమధిక ధర కల్గును.

**జ్యేష్ఠ మాసము:** శు.౬ల॥ బ. ౯ వరకు పొట్టు ధాన్యములు ధర హెచ్చును. శుద్ధ మున దూది, నూలు, నువ్వులు ధర పెరుగును. శు. ౭ వరకు రస ద్రవ్యములు, కంబళ్ళు, భోజన పదార్థములు ధరనిలబాటు. మణులు ధర సమమగును పూర్ణిమ నుండి ఇనుము, ఓషధులు, యవలు, శిలాజిత్తు లోహములుధర పెరుగును బ. ౭ల॥ నూనెలు, పప్పులు, కస్తూరి, సుగంధ ద్రవ్యములు, బంగారము లోహములు కొంతవరకు పెరుగును. మాసమంతయు ధాన్యము ధర హెచ్చు.

**ఆషాఢ మాసము:** శు.౧౩ల|| ధాన్యాదులకు ధర హెచ్చును. శు. ౭ల|| పొట్టుధాన్యములకు ధర హెచ్చును. శు. ౯ల|| బంగారాది లోహములు, నువ్వులు, ఇనుము, నూలు, కుంకుమ, సుగంధ ద్రవ్యములు, పట్టు వస్త్రములకు ధర హెచ్చును. శు. ౧౩ల|| వడ్లు, యవలు, శనగలు, తైలములు, లోహములు ధరహెచ్చును. బ. ౩ల|| ధాన్యాదులకు ధరహెచ్చును. భోజన వస్తువులు, పశువులు, కూరగాయలు ధర అధికము.

**శ్రావణ మాసము:** శు. 3 వరకు ధాన్యాదులకు ధర నిలబాటు. శు. ౩ల|| సస్యముల పీడలు, దూది, నూలుకు చెరుపు కల్గును. ధాన్యాదులు, అపరములు, ధాతు పదార్థ ములు, జీలకర్ర ధరలు హెచ్చును. వస్త్రములు, తెలుపు వస్త్రములకు ధరలు విశేషము. బహుళమందు రాళ్ళు, కొర్రలు, సిమ్మెంటు, యినుము, లక్క, భోజన పదార్థములు వెండి, కొబ్బరికి ధరలు హెచ్చును.

**భాద్రపద మాసము:** శు.౨ల|| కంబళ్ళు, ధావళీలు, పశువులు, యాంత్రిక వస్తువులు, నువ్వులు, వెండి, పొట్టు ధాన్యములు ధరలు నిలబాటు. బహుళమున తైలములు, ధాన్యము, గేదెలు, రసద్రవ్యములు, పసుపు గిరాకీ. కాఫీ, ఉల్లి, కందులు, ఉన్ని, పండ్లు ధరలు అధికము. లోహాదులు కొద్దిగ తగ్గి నిలబాటు. ఉప్పు, నూనెలు ధర గిరాకీ.

**ఆశ్వయుజ మాసము:** శు. ౧ల|| చందనము, కర్పూరము, బెల్లము, మిర్చి, కందగ డ్డలు, కర్పూరం, అగరు, సుగంధ ద్రవ్యములు ఆకులు ధర హెచ్చును. యాంత్రిక పరికరములు ధర హెచ్చును. కరెంటు గురించి ఆందోళన. బహుళమున మిర్యాలు, ఆవాలు, పసుపు, ఉప్పు, ఇంగువ, ఖర్జూరం, తైలాదులు, పాలు ధరలు అధిగమించును. మినుములు, పగడాలు ధరనిలబాటు.

**కార్తీక మాసము:** శు. ౯|| సమస్త ధాన్యములు, చెరకు, బెల్లము, ముత్యములు, ఎరుపు వస్తువులు, జల చరములు, వుల్లి, పుగాకు, త్రిఫలములు ధరలు హెచ్చును. బహుళమున కొంతవరకు ధరలు నిలబాటు. ధాన్యాదులు హెచ్చును.

**మార్గశిర మాసము:** శు౧౩ల|| గుగ్గిలం, లక్క, ఇంగువ, కర్పూరం, పాదరసం ధర పెరు గును. వస్త్రములు, మణులు, చెరకు, నెయ్యి ధరనిలబాటు. ధాన్యములు, పుగాకు, మిర్చి ధర ఆకాశాన్నంటును. రవాణా పెంపు. బహుళమున తిలతైలాదులు, లవణము, పుష్పాలు, తృణాదులు, కట్టెలు, ఇంధనం, అగరు, చందనం ధర హెచ్చును. పసుపు ధాన్యం హెచ్చును.

**పుష్య మాసము:** శు.౧ల|| సజ్జ, జొన్న ధాన్యము, భోజన వస్తువులు, కాఫీ, విలాస వస్తువులు, కంబళ్ళు, మంజీర, ఆకులు, పుష్పములు ధర హెచ్చును. బహుళమున పశుగ్రా సము, ఆముదం, తీగలు, ఆవాలు, బంగారాది లోహములు హెచ్చును. ఉల్లి, పసుపు తగ్గి పెరుగును. కొబ్బరి, యాలకులు, నెయ్యి కందమూలములు ప్రారంభమున నిలబాటు **తరువాత** హెచ్చును.

**మాఘ మాసము:** శు౧౮॥ పిప్పలి, పంచదార, పుష్పములు ధాన్యము ధర హెచ్చును. పూర్ణిమా ప్రాంతమున తైలాదులు ధాన్యాదులు, భోజ్యవస్తువులు హెచ్చును. బహుళమున బంగారాది పండ్లు, క్షార వస్తువులు చిత్రవస్తువులు ధర హెచ్చు.

అవిశెలు,

**ఫాల్గుణ మాసము:** శుద్ధమున తేనె, బెల్లం, శర్కర, నూలు, వడ్లు, నువ్వులు, ములు, ఓషధులు, మినుములు ధర హెచ్చును. బహుళమున రత్నములు తైలాదు మినుములు ధర నిలబాటు. మరియు గోధుమ, వాము, ఉసిరి, యవలు, వక్కలు; కొబ్బరి, శెనగలు, పండ్లు, దేవదారు ధరలు హెచ్చును.

* * *



# మేషరాశి ఫలితములు

అశ్వని: 1,2,3,4 పాదములు

భరణి: 1,2,3,4 పాదములు, కృత్తిక: 1వ పాదము

ఆదాయం 14 వ్యయం 14

రాజపూజ్యం 3 అవమానం 6

ఈ రాశివార్కి గురుడు సెప్టెంబరు 11 వరకు 5ట సువర్ణమూర్తి. తదాదివత్సరాంతం 6ట సువర్ణమూర్తి, శని వత్సరమంతయు 93 మార్చి 5 వరకు 10ట లోహమూర్తి. తదాది 11ట లోహమూర్తి. అక్టోబరు 30 వరకు రాహువు 9ట, కేతువు 3ట లోహమూర్తులు, తదాది వత్సరాంతం వరకు రాహువు 8ట, కేతువు 2ట రజిత మూర్తులు.

ఈ సం||రము సెప్టెంబరు 11 వరకు పంచమ గురుడు పరిపూర్ణ యోగప్రదుడు. దశమశని దోషి అయిననూ గురుబలమువలన అన్ని విధముల జయముకల్గుచుండును. ఈ రాశివార్కి పట్టుదల అధికముగా వుండును. తలచిన కార్యము సిద్ధించువరకు నిద్రించరు. కోపము తగ్గించుట మంచిది.

ఆగష్టువరకు శిరస్సు, పాదములు, రక్తనాళములకు సంబంధించు ఆరోగ్య లోపములుండును. దైవకార్యములు ఉత్సాహముగా చేయుదురు.

సంవత్సర మధ్యయందు కుటుంబసమస్యలు, వృత్తిసమస్యలు, పుత్ర సహకారంతో కార్యజయము, స్థిరాస్తులు గురించి భవిష్యత్ గురించి బాటలు వేయుచుందురు. అప్పుడప్పుడు అసంతుష్టిని దైన్యమును వెలిబుచ్చుచుందురు. ఉద్యోగులకు పై అధికారుల వత్తిడి ఎక్కువగును.

విద్యార్థులు ఉన్నత విద్యల నాశించవచ్చును. హూణవిద్య, సాంకేతిక విద్యలవార్కి మంచి ఫలితములుండును. మొత్తంమీద విద్యార్థులకు సంవత్సర ఉత్తరార్థమందు విద్యయందధిక శ్రమ పొందిన గాని ఉత్తీర్ణత నొందలేరు.

ఇనుము, తైలము వ్యాపారులకు సంవత్సరము చివరియందు మంచి ఫలితములుండును. వస్త్రము, ఫైనాన్సు, సినీ, ఫ్యాన్సీ వ్యాపారులకు సంవత్సరము చివరియందు విశేష ఫలితము లుండును. కోళ్ళ ఫారములు, మత్స్య వ్యాపారులకు, కంట్రాక్టర్లకు సంవత్సరము పూర్వార్థమందు మంచి ఫలితములుండును, అపరములు, మిర్చి, పుగాకు, రసాయన వ్యాపారులకు మిశ్రమ ఫలితములు కలుగును. వైద్య, న్యాయవాద మరియు స్వతంత్రవృత్తులవార్కి మధ్యమ ఫలములు, రాజకీయము అనుకూలము కాదు.

శుభ కార్యాదులు, భూగృహ నిర్మాణాదిశుభ కార్యములు సంవత్సరం ప్రారంభము చివరలయందు కలసివచ్చును. వ్యవసాయదారులకు మంచి ఫలితములు కల్గును. ఈ రాశివార్కి అదృష్ట సంఖ్య 9. వీరు పగడము ధరించుట మంచిది.

అశ్వినివారు వైఢూర్యము, పుష్యరాగము ధరించుట, గురువార నియమములు చేయుట, విష్ణు స్తోత్రములు పఠించుట మంచిది.

భరణివారు వజ్రము, నీల పుష్యరాగములు ధరించుట, గణేశ్వర, ఆంజనేయ జపము లాచరించుట, శుక్రవార నియమములు చేయుట వలన మంచి ఆరోగ్యముకల్గి మనోభీష్టము నెరవేరును.

కృత్తికవారు కెంపుధరించుట, జాతిపచ్చ ధరించుట, శనివార నియమములు చేయుట మరియు సుబ్రహ్మణ్య పూజలు చేయుట మేలు.

మొత్తం మీద ఈ రాశివార్కి 4,6,9,10,2,3 మాసములు అత్యంత యోగప్రదములు. రాహు కేతు

వులు, శని గురుల జపశాంతులు, దానాదులు, ఈశ్వరాభిషేకములు ఆచరించుట వలన దోషములు తొలగి కల్యాణాది శుభములు, స్థిరవృద్ధి, ఆరోగ్య లాభములు కలుగును. ఆది, సోమ, శుక్రవారములు, 1,3,5,9 తేదీలు యోగప్రదములు.

స్త్రీలు గురు, శుక్రవార నియములు, లక్ష్మీ విష్ణు పూజలు చేయుటవలన గృహమందు శాంతికర్తి వృద్ధికలుగును.

## వృషభరాశి

కృత్తిక: 2,3,4 పాదములు
రోహిణి: 1,2,3,4 పాదములు, మృగశిర: 1,2 పాదములు

| | |
|---|---|
| **ఆదాయం 8** | **వ్యయం 8** |
| **రాజపూజ్యం 6** | **అవమానం 6** |

ఈ రాశివార్కి గురుడు సెప్టెంబర్ 11వరకు 4ట రజితమూర్తి. సెప్టెంబర్ 11నుండి వత్సరాంతము 5ట తామ్రమూర్తి. శని 93 మార్చి 5 వరకు 9ట రజితమూర్తి తరువాత 10ట తామ్రమూర్తి. రాహువు 8ట, కేతువు 2ట అక్టోబర్ 31వరకు సువర్ణమూర్తులు. పిమ్మట వత్సరాంతము రాహువు 7ట కేతువు జన్మమందు తామ్రమూర్తులు.

వీరు ఉత్సాహవంతులు సంఘశ్రేయస్సు కోరుచుందురు. అలంకార వస్తువాహన ప్రియులు. మృష్టాన్న భోజనము చేయుచుందురు. కొంచెము లుబ్దత్వముతగ్గించుట మంచిది. తలచిన కార్యమును ఇతరుల సహకారంతో ఉన్నతముగా చేయుచుందురు. దైవ స్థానములందు, దైవనిర్మాణమునందు ముందంజ వేయుచుందురు. సం|| ఉత్తరార్ధమందున బంధు విరోధములు, వ్యవహార చికాకులు సూచించుచున్నవి. దూరయాన సూచనలున్నవి. సంతాన లాభము. సం|| పూర్వార్ధమున అనుకూలము. సంవత్సరము ఉత్తరార్ధమందు కళత్ర ఆరోగ్యలోపములు, వైద్యరీత్యా ధనవ్యయము నడుము, చేతులకు నొప్పులును, నరముల విస్సత్తువ కల్గుచుందును. మనోచింతన హెచ్చుగ వుండును.

మొత్తము మీద గతంకంటె చాల మంచి ఫలితములు గలవు. వ్యాపారవిలకడ, అభివృద్ధి, నూతన వ్యాపార ప్రారంభములు చేయుచుందురు. సాంకేతిక యాంత్రిక వ్యాపార సంస్థలందు మార్పులు అభివృద్ధిగురించి ధనవ్యయములు చేయుచుందురు. భూమిగృహములు మార్పులు జయములుకలవు. కోర్టు వ్యవహారములు నిలచివుండును. విద్యార్థులకు గణితము, ఆంగ్లము సబ్జక్టులందు అత్యధిక శ్రద్ధ కావలెను. కళాపోషకులకు ప్రభుత్వ సాంఘిక అండదండలుండును. మంచి కాలము.

స్వతంత్రవృత్తులవార్కి అభివృద్ధి ప్రోత్సాహకరమైన కాలము సం||రం చివరనందు చికాకులు, వ్యవసాయదారులకు సం||రం ఉత్తరార్ధము మంచిది. కంట్రాక్టులు యోగించవు.

అపరములు, కలప, ఫ్యాన్సీ వ్యాపారులకు నవంబరు తరువాత అధికారుల వత్తిడు అధికము. యాంత్రిక, తైల, పేపరు, రైస్‌మిల్లు వ్యాపారులకు స్వల్పమార్పులరీత్యా ధనవ్యయము కలుగు చున్ననూ, అభివృద్ధి గలదు. అధిక ధనలాభములు కలసివచ్చును. మత్స్యములు, కోళ్ళు వ్యాపారులు, వడ్డీవ్యాపారులు, వస్త్రవ్యాపారులకు సం||రం పూర్వార్ధము విశేష ఫలితములు. సివిల్వృత్తి, న్యాయవాదవృత్తి, వైద్య వృత్తులవార్కి సామాన్యఫలితములు.

--

కృత్తికవారు కెంపు మరియు పుష్యరాగము రాళ్ళు ధరించుట మంచిది. శివ, రాజేశ్వరీ పూజలు చేయుట, గురువార నియమములు చేయుట మంచిది.

రోహిణివార్కి ముత్యము, పగడము రాళ్ళు ధరించుట మంచిది. సుబ్రహ్మణ్య శివాభిషేకములు చేయుట మంచిది. విశేషము.

మృగశిరవారు పగడము ధరించుట. ఆంజనేయ దత్తాత్రేయ, దేవీపూజలు చేయుట మంచిది.

మొత్తము మీద ఈ రాశివార్కి సం||రం చివరనుండి చికాకులు వృద్ధి కల్గును. తద్దోష పరిహారార్థము సుబ్రహ్మణ్య అభిషేకములు. శుక్ర, రాహు కేతు గ్రహజపములు శాంతులు చేయుటవలన వైద్య చికాకులు, ఋణ చికాకులు తగ్గి యత్నకార్యసిద్ధి కలుగును.

భూమి, గృహయోగాదులు సం||రం పూర్వార్థము అనుకూలించును. శ్రమకరముగ వున్నను స్థిరాస్తులు వృద్ధి కల్గును. మంగళవార నియమములు, శనివారనియమములు చేయుటవలన ఆరోగ్యాది శుభములు, ఋణవిమోచనము కలుగును.

స్త్రీలు శుక్ర శనివార నియమములు, లలితా, శివ ఆరాధనలు చేయుట మంచిది. కుటుంబమందు శాంతి కలుగును.

## మిధునరాశి

మృగశిర: 3,4 పాదములు

ఆరుద్ర: 1,2,3,4 పాదములు, పునర్వసు: 1,2,3 పాదములు

| | |
|---|---|
| ఆదాయం 11 | వ్యయం 5 |
| రాజపూజ్యం 2 | అవమానం 2 |

ఈ రాశివార్కి గురుడు 92 సం||రం సెప్టెంబరు 11 వరకు 3ట లోహమూర్తి. తదాది వత్సరాంతము వరకు 4ట తామ్రమూర్తి. అక్టోబరు 30 వరకు రాహువు 7ట, కేతువు జన్మమందు తామ్రమూర్తులు. తరువాత వత్సరాంతము వరకు రాహువు 6ట, కేతువు వ్యయమందు తామ్రమూర్తులు. శని 93 మార్చి 5వరకు 8ట సువర్ణమూర్తి. పిమ్మట 9ట రజితమూర్తి.

వీర్కి సం||ర మంతయు శని అష్టమందున్ననూ చాలా యోగప్రదుడు. స్థిరాస్తులు ఆయుర్దాయములను రక్షించును. వృద్ధిచేయును. రాహు కేతువులు మిశ్రమ ఫలితముల నిచ్చును. గురుడు సెప్టెంబరు తరువాత 3/4 యోగప్రదుడు. శనిగ్రహ బలము వలన భూమి, గృహ నిర్మాణాది శుభకార్య లాభములు కలుగుచుందును.

ఈ రాశివార్కి అదృష్టసంఖ్య 5. వీరు సౌమ్యస్వభావులు. మాటపై నుందురు. కాని యితరులకు వీ రనిన ఈర్ష్యా ద్వేషములు హెచ్చుగవుండును. బంధుమిత్రులకు దూరముగ వుందురు. సంవత్సర ఉత్తరార్థమున శుభములకు ధనవ్యయములు కలుగును. కార్యజయములు కల్గును. కంఠము, ఉదరము, మోకాలుసంబంధ ఆరోగ్యలోపములు తరచు వచ్చుచుండును. కుటుంబ విషయములు వ్యవహారములు స్వయముగ చూచుకొనుట మంచిది. వ్యవసాయదారులకు సామాన్య ఫలితములు, తరచు ప్రయాణములు చేయుచుందురు. కోర్టువ్యవహారములు నిలచివుండును. మంచివారివలన, ఉన్నత వ్యక్తులవలన స్నేహములు అభివృద్ధి కలుగును. సంఘమునకు మేలు చేయు చుందురు. సం||రము పూర్వార్థముకంటె ఉత్తరార్థమున దైవకార్యములాచరించు చుందురు. శత్రువులవలన జయము కలుగును.

విద్యార్థులకు రెండవఛాన్సు చూడవలసి వచ్చును. గణితము, ఆంగ్లము సబ్జక్టులందధికశ్రద్ధ కల్గివుండవలెను. సం||ర పూర్వార్థమున విద్యయందు ఆసక్తివున్ననూ విఘ్నములు కలుగుచుండును. ఇంజనీర్లు, న్యాయవాద వృత్తివార్కి అప్పుడప్పుడు విశేష ఫలితములు పేరు ప్రతిష్ఠలు కలుగుచుందును.

యాంత్రిక ధాన్య, తైలవ్యాపారులకు విశేష లాభములు. వైద్యవృత్తి, సినీ వ్యాపారులకు యితరులవల్లన ఇబ్బంది కల్గుచుండును. నిదానము అవసరము.

జాయింటు వ్యాపారము సంవత్సరము చివరమాత్రమే అనుకూలము. కిరాణా, ఫ్యాన్సీ, అపరములు వ్యాపారులకు జూన్, అక్టో, జన, మార్చి నెలలందు, ఆర్థిక యిబ్బందులు కలుగుచుండును. చేపలు, కోళ్ళఫారం వ్యాపారులకు మిశ్రమ ఫలితములు. అన్ని రంగముల ఉద్యోగులకు ప్రమోషన్‌లు నిలచును. అధికారులవత్తిడులు హెచ్చుగ వుండును. సంవత్సరము చివరయందు ప్రమోషన్‌లు, ఉద్యోగ లాభములు, విద్యాభివృద్ధి, యత్నకార్యసిద్ధి కలుగును.

మృగశిర వారు పగడము ధరించుట, శ్రీ విష్ణు, రామచంద్ర ఆరాధనలు చేయుట శనివారనియమ ములు చేయుట మంచిది.

ఆర్ద్రవారు గోమేధికము, నీలమణి ధరించుట సోమ, శనివార నియమములు, చంద్రశేఖర, భ్రమరాం బాష్టకములు చేయుట మంచిది.

పునర్వసు వారు పుష్యరాగము రాయి ధరించుట, గురువార నియమములు చేయుటవలన మనోభీష్టము నెరవేరును.

మొత్తము మీద ఈ రాశివారు మహామృత్యుంజయ రుద్రాభిషేక జపాదులు చేయుటవలన రాహు కేతువు, శనిగ్రహ జపశాంతులు చేయించుట, శని, సోమవార నియమములు చేయుటవలన అపమృత్యు దోషముతొలగును. శివలింగ దర్శనము చేయుచుండుటచే మంచి మేలు కల్గును.

స్త్రీలు శనివార మంగళవార నియమములు చేయుట. లక్ష్మీ శ్రీకృష్ణ గణేశ్వర ధ్యానములు చేయుచుం డుటవలన కుటుంబమందు లక్ష్మీవృద్ధి, కుటుంబసఖ్యత, సంతాన వృద్ధి కల్గును.

## కర్కాటకరాశి

పునర్వసు: 4వ పాదము

పుష్యమి: 1,2,3,4 పాదములు, ఆశ్లేష: 1,2,3,4 పాదములు

| | |
|---|---|
| ఆదాయం 5 | వ్యయం 5 |
| రాజపూజ్యం 5 | అవమానం 2 |

ఈ రాశివార్కి గురుడు ద్వితీయమందు సెప్టెంబరు 11 వరకు సువర్ణమూర్తి, తదాదివత్సరాంతం 3 ట లోహమూర్తి శనివత్సరమంతయు 7ట రజితమూర్తి. రాహువు 6ట, కేతువు 12ట అక్టోబరు 30 వరకు రజితమూర్తులు. తదుపరివత్సరాంతం వరకు రాహువు 5ట, కేతువు 11ట సువర్ణమూర్తులు.

రాహు కేతువులు నవంబరుమండి సువర్ణమూర్తులు. యోగించుదురు. సెప్టెంబరువరకు ద్వితీయమందు గురుడు పూర్ణయోగప్రదుడు. వీర్కి శని 7ట కేతువు వ్యయమందు దోష ప్రదులే అయిననూ ద్వితీయ గురుని వలనను శనిమూర్తిమంతం రీత్యాయోగ కారకుడు అగుటవలననూ ప్రతిపనియు ఆలస్యమయిననూ పట్టుదలతో ధనవ్యయముతో సాధించు కొనగలరు. ఆరోగ్య చికాకులు తరచు కల్గుచుండును.

ఈ రాశివార్కి అదృష్ట సంఖ్య 2. వీరి మనస్సు మృదువైనది. సుఖము, హుందాతనము, సంఘ నాయకత్వము వీరిలో ప్రత్యేకతలు. హృదయదౌర్బల్యము, నోటిపూత, ప్రయాసతో ధనార్జన, శుభకార్యసిద్ధి సం||రము ఉత్తరార్ధము నందు కార్యములవత్తిడి, తొందర కల్గును, స్వయంకృషివలన వ్యాపారాదులు వృద్ధి

చెందును. వ్యవసాయదారులు పెట్టుబడులు తగ్గించుట మంచిది. కంట్రాక్టర్లకు అర్ధ లాభములు కల్గును. సం||రం ఉత్తరార్ధము నుండి బంధు స్నేహితుల బలము వృద్ధి అగును. కళత్ర ఆరోగ్య లోపములు తరచు కల్గుచు నివారణ అగును. దూరప్రయాణములు చేయుచుందురు.

విద్యార్థులు హెచ్చు శ్రద్ధ వహించుటవలన విద్యావృద్ధి కల్గును. సైన్సు విద్యార్థులకు మంచి కాలము. గణితము, యింజనీరింగు విద్యార్థులకు సం||ర పూర్వార్ధము యోగప్రదము.

ప్రభుత్వ ఉద్యోగస్థులు అన్ని రంగములవార్కి మధ్యమ కాలము అధికారవత్తిడులు పెరిగి, క్రిందివారి సహాయం లేనిదే కార్యాలు సాగించలేరు. ఉత్తరార్ధమునందు అధికారుల ఆగ్రహములకు గురిఅగుట, అయత్న బదిలీలు కలుగుచుండును. స్వతంత్ర వృత్తులవారికి సం||రం పూర్వార్ధము యోగప్రదము. సినీ, న్యాయవాద, వైద్యవృత్తులవారికి సామాన్య ఫలము. నిదానించుట మేలు. 6,11, జనవరి మాసములందు నష్టసూచనలున్నవి.

ఇనుము, కలప, పుగాకు, తైలవ్యాపారులు పెట్టుబడులు పెట్టరాదు. వస్త్రములు, ఎరువులు వ్యాపారులకు సం||రం పూర్వార్ధము యోగప్రదము. రైస్ మిల్లర్లకు సామాన్య ఫలితములు మత్స్యములు, కోళ్ళఫారం వ్యాపారులకు మధ్యమ ఫలములు.

పునర్వసువారు పుష్యరాగము ధరించుట, సుందరకాండ పారాయణ చేయుట మంచిది. పుష్యమి వారు నీలమణి, పుష్యరాగముధరించుట మంచిది. శ్రీ వేంకటేశ్వరారాధనలు చేయుట మంచిది.

ఆశ్రేషవారు జాతిపచ్చ, కెంపు ధరించుట మంచిది.

మొత్తము మీద ఈ రాశివార్కి భాగ్యహలాభములు సం|| చివరియందు ప్రారంభములందును వివాహాది శుభ కార్యములు సం||ర పూర్వార్ధమునందును, వ్యవహారలాభములు మే,జూలై, ఆగష్టు, అక్టోబరు, ఫిబ్రవరి మాసములందును కలసివచ్చును.

ఈ రాశివారు శనికుజ రాహు కేతువుల జపాలు రుద్రాభిషేకములు చేయించుకొనుట, శనివార నియమములు చేయుచుండుటవలన దైన్యము ప్రమాదములు తప్పి, కటుంబవృద్ధి మరియు ఋణవిముక్తి, ధనమధికముగ కలసివచ్చును. అలంకారవస్తు లాభములు కల్గును. శనిగ్రహదోష పరిహారము నిమిత్తము రుద్రాభిషేకములు, శనీశ్వర తైలాభిషేకములు చేయించుచు నీలమణిని ధరించిన, శివలింగదర్శనము చేసిన శాంతిశుభాది స్థిరములు కల్గును.

## సింహరాశి

మఖ: 1,2,3,4 పాదములు
పుబ్బ: 1,2,3,4 పాదములు, ఉత్తర: 1వ పాదము

| | |
|---|---|
| ఆదాయం 8 | వ్యయం 14 |
| రాజపూజ్యం 1 | అవమానం 5 |

ఈ రాశి వార్కి సెప్టెంబరు 11 వరకు గురుడు జన్మమందు రజిత మూర్తి. తదాది వత్సరాంతం 2ట తామ్రమూర్తి. శని వత్సరమంతయు 6ట లోహమూర్తి. రాహువు 5ట కేతువు 11ట అక్టోబరు 30 వరకు లోహమూర్తులు. పిదప రాహువు 4ట, కేతువు 10ట తామ్రమూర్తులు.

వీర్కి గురుడు జన్మమందు ప్రతిబంధకములనిచ్చును. ద్వితీయ మందు సెప్టెంబరు 11 నుండి కొంత వరకు యోగప్రదుడు. అక్టోబరు తరువాత రాహు కేతువులు అంత మంచివికావు. శనియోగప్రదుడు.

వీరు దానధర్మములు చేయుటయందభిలాషులు. సంఘ నాయకత్వము, సూటిగ మాట్లాడుచుండుట, స్వతంత్ర జీవితము కోరుచుండుట. అప్పుడప్పుడు బుద్ధిబలము వక్రించుట, స్వతంత్రవిషయములకు చికాకులుపడుట మున్నగు లక్షణములుండును. ఈ రాశివారు స్త్రీలలో మనస్తాపమధికము, వాత, పిత్త ఆరోగ్యలోపములు. మానసిక స్థిమితము స్థిరాస్తులు వృద్ధి చేయుటయందు నిమగ్నత కొంతవరకు నెరవేరుట, సం||రము ఉత్తరార్ధము వివాహాది శుభకార్యము లాచరించు చుందురు. ప్రతి పనియు దీర్ఘకాల ముండునట్లు నిదానించుచు బద్ధకించుచూ చేయుచుందురు. భూగృహ మార్పులు అనుకూలించును. ప్రతి విషయము యితరులతో ముఖాముఖీ మాట్లాడుచుందురు. అప్పుడప్పుడు కలహములు వచ్చును. వివాహాది శుభాదులు అక్టోబరు తరువాత అనుకూలములు.

వ్యవసాయదారులకు ఫలితములు సామాన్యము. కంట్రాక్టర్లకు సం||ర పూర్వార్ధం యోగప్రదం. విద్యార్థులకు విద్యాప్రతిబంధకములు. సంఘప్రతిబంధకములు కలుగుచున్ననూ గురుబలమువలన నూతన విద్యాలాభములు, నూతనోద్యోగలాభములు కలుగును. రాహుకేతువుల కుజగ్రహజపములు శాంతులు చేయించుటవలన విద్యాటంకములు తొలగును. సైన్సు విద్యార్థులకు సం||ర పూర్వార్ధము మంచిది. ఉద్యోగస్తులకు మంచికాలము. ఆర్థిక లాభములుండును. యత్న బదిలీలు కలుగును. సం||ర ఉత్తరార్ధమందు అప్పుడప్పుడు అయత్న బదిలీలు శ్రమ త్రిప్పట కల్గుచుండును. మే, జూన్, డిశెంబరు, జనవరి, ఫిబ్రవరి నెలలంత అనుకూలముకాదు, న్యాయ వాద వైద్యవృత్తులవార్కి చాల మేలుకలదు. రాజకీయవాదులకు మంచిది.

వ్యాపారస్తులకు మంచి కాలమేగాని రసాయన, యాంత్రిక, వస్త్రవ్యాపారులకు ఆకస్మిక అధికార వత్తిడులు, వ్యాపారమార్పులు కలుగును. అపరములు, బెల్లం, ధాన్యము, కూరగాయులు వ్యాపారులకు ఉన్నత ఫలితములు కలుగును. నిల్వదారులకు మధ్యమము. రైస్ మిల్లర్లకు అధికధన లాభము లుండును. సం||ర ఉత్తరార్ధమందు శ్రమచికాకులు కలుగుచుండును. తైలము, కలప, లోహవ్యాపారులకు మంచి ఫలితములు, ఫ్యాన్సీ వ్యాపారులకు 7,8,9,1,2 మాసములు అంతగా యోగించవు. స్వతంత్ర వృత్తులవార్కి, కోళ్ళ, మత్స్యవ్యాపారులకు 7,8, 10,12,2 మాసములు కాక మిగిలిన మాసములు మంచివి. జాయింటులంత లాభములు కావు.

మఘవారు వైఢూర్యము పగడము ధరించుట దుర్గా, గణేశ్వర పూజలుచేయుట మంచిది. పుబ్బవారు వజ్రము లేక తెలుపురాయి ధరించుట శనివారనియమములు చేయుట, ఉత్తరవారు కెంపు, గోమేధికము ధరించుట, సుబ్రహ్మణ్య ఆరాధనలు చేయుటమంచిది.

మొత్తముమీద ఈ రాశివార్కి నూతన వ్యాపార ప్రారంభములు స్థిరముల వృద్ధి గృహలాభములు కళ్యాణాది శుభములు సం||రం పూర్వార్ధము అంత్యమునందు కలిసివచ్చును. గురుబలము వలన లోపములు, చికాకులు తొలగును. ఆరోగ్యము బాగుండును. గురు, చంద్ర, రాహుకేతుగ్రహములకు జపశాంతులు చేయుటవలన యత్న కార్యసిద్ధి, శుభకార్యానుకూల్యత ఆరోగ్యలాభములు కలుగును. ఆది, గురువార నియమములు యోగించును. వీర్కి 1,4,5 సంఖ్యలు ఆదిత్య, మంగళ, గురు, శని వారములు యోగించును. అదృష్ట సంఖ్య 1.

# కన్యారాశి

ఉత్తర: 2,3,4 పాదములు

హస్త: 1,2,3,4 పాదములు, చిత్త: 1,2 పాదములు

ఆదాయం 11 వ్యయం 5

రాజపూజ్యం 4 అవమానం 5

ఈ రాశివార్కి గురుడు సెప్టెంబరు 11 వరకు వ్యయమందు సువర్ణమూర్తి. తదాది వత్సరాంతం వరకు జన్మమందు సువర్ణమూర్తి. శనివత్సరమంతయు 10ట మార్చి 5 తరువాత 6ట సువర్ణమూర్తి. రాహువు 4ట, కేతువు 5ట అక్టోబరు 30 వరకు తామ్రమూర్తులు. తరువాత వత్సరమంతయు రాహువు 3ట, కేతువు 9ట లోహమూర్తులు.

వీర్కి గురుబలము గలదు. శని బలము గలదు. సం||ర ఉత్తరార్థము నుండి జన్మ గురుడు బలమైన ప్రతిబంధకములు. ఆరోగ్య మార్పులు చేయుచుండినమా మూర్తిమంతం రీత్యా పూర్ణ యోగప్రదుడు. వీర్కి గతం కంటె మేలు. బంధుమిత్ర సందర్శనము యితరుల సహకారము వలన శుభకార్యాచరణలు కలుగును. సం||ర ఉత్తరార్థమునందు స్థానభ్రంశము, సంతాన, ఆరోగ్య నష్టములు, చర్మరోగములు కలుగుచుండును. సం||ర పూర్వార్థము భూగృహనిర్మాణాదులు చేయుటమేలు. నవంబరు తరువాత వ్యవహార లావాదేవీలు కలుగును. మోకాలు నొప్పులు గుల్మరోగములు, ఆయాసము తరచుకలుగుచు నివారణ అగుచుండును.

విద్యార్థులకు సం||ర ఉత్తరార్థము మంచి ఫలితములు కలుగును. గణితము ఆంగ్లము వార్కి మంచిది. వైద్యన్యాయవాద వృత్తుల విద్యార్థులకు అంత అనుకూలముకాదు. గురు గ్రహజపము సరస్వతీ పూజలు చేయుచుండుట వలన విద్యయందాటంకములు తొలగుచుండును. ఉపాధ్యాయులు, రక్షక భటులకు, ఉద్యోగులకు సం||ర ఉత్తరార్థము సామాన్య కాలము. సం||ర పూర్వార్థము యత్నబదిలీలు, ప్రమోషన్‌లు కలసి వచ్చును. వైద్యులు, ధాన్య, అపరముల వ్యాపారులకు 5,9,11,12,3 మాసములందు శత్రువృద్ధి, ధనవ్యయములు వుండును. స్వతంత్రవృత్తి అధికారులకు, న్యాయవాదులకు సినీవృత్తివార్కి 5,7,9,11,12,1 నెలలుకాక మిగిలిన నెలలందు ప్రోత్సాహముగ వుండును. ఇంకనూ వృత్తి బలము నూతన వ్యాపారములు ప్రారంభము కల్గును. సినీ వ్యాపారులకు ఉన్నత పేరు ప్రఖ్యాతులు లాభాలు కల్గును. స్థిరములు కలసి వచ్చును.

వస్త్రములు, ఫ్యాన్సీ, వడ్డీ వ్యాపారులకు 3/4 వంతు ఫలితములు బాగుండును. కంట్రాక్టర్లకు ఉన్నత ఫలితములు గాని యితరుల బెడద అధికము, వడ్డీ, వస్త్ర, కలప, కిరాణా వ్యాపారులకు అత్యంత యోగప్రదములు. నూతన కార్యక్రమములు నిదానముమీద కలసివచ్చును.

బంగారాది లోహములు, పేపరు, రసాయన వ్యాపారులకు సదవకాశము. జాయింటులను కూలము. కంట్రాక్టర్లకు, ధావ్యము, మత్స్యములు, కోళ్ళు వ్యాపారులకు సం||రం పూర్వార్థము మంచి కాలము. ఉత్తరార్థము సామాన్యము. అయిననూ కొన్ని కొన్ని ముఖ్యమయిన మార్పులు చేయుదురు. వ్యవసాయుదారులకు మధ్యమము.

ఉత్తరవారు కెంపు ధరించుట, ముత్యము ధరించుట మంచిది. 4,6,12,1 మాసములు యోగించవు. దుర్గ, గణేశ్వర ఆరాధన చేయుటలు మంచిది. సోమవార నియమములు చేయుట మంచిది.

హస్తవారు ముత్యము ధరించుట లలిత రామచంద్ర ఆరాధనలు గురు, కేతు గ్రహములకు జపశాంతులు చేయించుటవలన మనోభీష్టము నెరవేరును.

చిత్తవారు పగడము నీలము ధరించుట, శ్రీవిష్ణు, భ్రమరాంబ ధ్యానములు చేయుట మంచిది. మొత్తము మీద అనుకూలము.

మొత్తము మీద ఈ రాశి వార్కి డిశెంబరు తరువాత కుటుంబ సమస్యలు ఆరోగ్య, ఆర్థిక చిక్కులు కలుగును. భూగృహమార్పులు కళ్యాణాది శుభకార్యములు సం||ర పూర్వార్ధము నందును, చివరనందును కలసివచ్చును.

వీర్కి 5 అదృష్టసంఖ్య. 2,3,5,9,10 తేదీలు సంఖ్యలు నెలలు యోగప్రదములుగ వుండును. సం||ర ఉత్తరార్ధమందు గురు కేతు కుజ గ్రహజప శాంతులు, రుద్రాభిషేకములు చేయించుకొనవలసి వచ్చును.

స్త్రీలు గురువార నియమములు చేయుట, శ్రీలక్ష్మీ రమణుల ఆరాధన చేయుటద్వారా సౌభాగ్యవృద్ధి, సంతానవృద్ధి, కుటుంబశాంతి కల్గును.

## తులారాశి

చిత్త: 3,4 పాదములు

స్వాతి: 1,2,3,4 పాదములు, విశాఖ: 1,2,3 పాదములు

| | |
|---|---|
| ఆదాయం 8 | వ్యయం 8 |
| రాజపూజ్యం 7 | అవమానం 1 |

ఈ రాశివార్కి శని వత్సరమంతయు 4ట రజితమూర్తి. గురుడు సెప్టెంబరు 11 వరకు 11ట లోహమూర్తి. తదాది వత్సరాంతం వరకు వ్యయమందు రజితమూర్తి. రాహు 3ట కేతు 9ట అక్టోబరు 20 వరకు సువర్ణమూర్తులు.

ఈ రాశివార్కి సెప్టెంబరువరకు గురుడు పూర్ణయోగప్రదుడు. అర్ధాష్టమశని కష్టనష్టశ్రమ ప్రదుడయి ననూ స్వక్షేత్రమందుండుట వలన కొంతమందికి యిబ్బంది కలుగుచేయుడు. అక్టోబరు తరువాత కేతువు దోషి. కుజుడు 1/2 యోగించును.

వీరు ప్రియముగ మాట్లాడుచుందురు. కపటము యుక్తితో మెలగుచుందురు. సంఘగౌరవము గలవారు. వీర్కి మిత్రులు శత్రులుగాను, శత్రువులు మిత్రులుగను వుందురు. గౌరవము గురించి పాటుపడుచుందురు. ఉదరసంబంధ మోకాలు సంబంధ అనారోగ్యములుండును. వాతత్వముగ వుందురు. సం||ర ఉత్తరార్ధ మందు వ్యవహారముల నిమిత్తము, మాటపట్టింపుల నిమిత్తము, పుణ్యకార్యముల నిమిత్తము ధనము వ్యయము చేయుదురు. స్థిరములు మణిరత్నములు లాభము కల్గును. నూతన వివాహితులు సం||ర ఉత్తరార్ధమునందు అన్యోన్యతలతో మాట గౌరవముతో నిదానించి మసలుట మంచిది. దూర ప్రయాణములు కలసివచ్చును.

జాయింటు వ్యాపారులకు మార్పులు కల్గుచు నిలబడివుందురు. విశేషలాభములు కల్గును. సం||ర ఉత్తరార్ధము నూతన వ్యాపార ప్రారంభములు కల్గును. విద్యార్థులకు కుటుంబసమస్యలుండుట వలన ఆటంకములున్ననూ ఉన్నత విద్యాయోగములు వుండును. ఉద్యోగులకు ప్రభుత్వ అధికార, యాంత్రిక ఈతి బాధలుండును. ప్రమోషన్ నిలచివుండును. లావాదేవీలు నిలచివుండును. ఆంగ్లము, గణితము, తెలుగు సబ్జక్టులందధిక శ్రద్ధ చూపవలెను. సైన్సు విద్యార్థులకు మంచి ప్రోత్సాహకాలము. సం||ర చివరనందు అధికారులకు యత్నబదిలీలు వుండును. చిత్రకళాకారులకు సినీ కళాకారులకు ప్రోత్సాహకాలము. మిల్లర్లు ధాన్యము వ్యాపారులకు 4,9,10,11,1 మాసములు అనుకూలము కావు. మిగిలిన కాలము విశేష ఫలిత ములు మత్స్యవ్యాపారులు, కోళ్ళ ఫరం వ్యాపారులకు మధ్యమ ఫలితములు కల్గును. శ్రమ, త్రిప్పట హెచ్చు, అపరములు, మిర్చి, పుగాకు, కలప, ఫ్యాన్సీ వ్యాపారులకు 7,11,12, తరువాత మాసములు అధికార, అనధికార వత్తిడులు కల్గుచున్నను ధన వ్యయములు కలుగుచున్ననూ ఆశించిన ఫలితములు నెరవేరును.

పేపరు, రసాయన, తైల, వస్త్ర, వడ్డీ వ్యాపారులకు కొంచెము ఆలస్యము, ఆటంకములు కలిగినను వృద్ధి కలుగును. పెట్టుబడులు నిదానించి పెట్టుట మేలు.

చిత్రవారు పగడమురాయి ధరించుట, మంగళవార నియమములు చేయుట మంచిది. జాయింటులు మధ్యమము.

స్వాతి వారు గోమేధికము, నీలము ధరించుట మంచిది. వీరు అంగారక సుబ్రహ్మణ్య రాహుశుక్ర గ్రహములకు జపములు చేయించుట మంచిది.

విశాఖ వారు పుష్యరాగ నీలము ధరించుట విశ్వేశ్వర, దుర్గజప ధ్యానములాచరించుట మంచిది. వీర్కి విశేష కాలము.

మొత్తము మీద ఈ రాశి వార్కి సం||ర ఉత్తరార్థం కంటె పూర్వార్థమే మేలు. అర్థాష్టమ శని వున్ననూ సం||ర పూర్వార్థమున గురు బలమువలన అన్నియు బాగుండును. ఉత్తరార్థమునందు గురు, శని, రాహు కేతులకు జపశాంతులు చేయించుటవలన ఆరోగ్యము వ్యవసాయ వ్యాపార, భూగృహ కళ్యాణాది శుభములు కలసివచ్చును.

వీర్కి అదృష్టసంఖ్య 6. గురు శనివార నియమములు చేయుట మంచిది. రుద్రాభిషేకములు, శనీశ్వర తైలాభిషేకములు, కుంకుమ పూజలు చేయుచుండవలెను. 4,6,8,9,12,2,3 మాసములు. ఆదిత. బుధ. శుక్రవారములు కలసివచ్చును.

స్త్రీలు లక్ష్మి, గణేశ, శివ ఆరాధనలు చేయుటవలన కుటుంబమందు అభివృద్ధి కలుగును.

## వృశ్చికరాశి

విశాఖ: 4వ పాదము, అనూరాధ: 1,2,3,4 పాదములు
జ్యేష్ఠ: 1,2,3,4 పాదములు.

| | |
|---|---|
| ఆదాయం 14 | వ్యయం 14 |
| రాజపూజ్యం 3 | అవమానం 1 |

ఈ రాశివారికి గురుడు సెప్టెంబరు 11 వరకు 10ట సువర్ణమూర్తి. తదాది వత్సరాంతము వరకు లాభమందు లోహమూర్తి. శని వత్సరమంతయు 3ట సువర్ణమూర్తి. పిదప 93 మార్చి 5 లగాయితు 4ట రజితమూర్తి. రాహువు 2ట కేతువు 8ట అక్టోబరు 30 వరకు రజితమూర్తులు. తదాది వత్సరాంతమువర కును రాహువు జన్మమందు, కేతువు సప్తమందు రజితమూర్తులు.

వీరికి సం||ర పూర్వార్థమునందు సమస్త కోరికలు నెరవేరును. రాహు, కేతువుల ప్రభావమువలన అక్టోబరు 30 తరువాత శారీరక, మానసిక, హృద్రోగాది పీడలు కలుగుచుండును. శని 3/4 యోగం. ఈ రాశివారికి పట్టుదల హెచ్చుగా యుండును. ప్రతిపనియు స్వతంత్రించి, స్వతంత్రముగ, కడు నేర్పుగానూ చేయుచుందురు. ఇతరులను నమ్మరు. కుటుంబమురీత్యా సోదరులవలన యిబ్బందులను ఎదుర్కొందురు. లింగసూచన స్థానమందున గాని, కంఠ సంబంధముగా గాని ఆరోగ్యరీత్యా చికిత్సమపొందుట కలుగును. ప్రతి పని యందు విపరీతమైన అనుమానములవలన, కంగారుపడుచుండుట, అపనిందల పాలగుచుండుట జరుగును.

వ్యాపారములందు పెట్టుబడులు తగ్గించి మెలగుట మంచిది. సంవత్సరప్రారంభము మరియు, చివ రలయందు భూగృహమార్పులు, శుభకార్యాదులును చేయుదురు. వాహనసౌఖ్యము తక్కువగా యుండును. సంవత్సర పూర్వార్థమున బంధుమిత్రులతో సఖ్యము, నిరతాన్న దానములు, మృష్టాన్న భోజనములు చేయు

చుందురు. సెప్టెంబరు ప్రాంతమందు వ్యవహారములందు చిక్కులు, ఆరోగ్యమునందు లోపసూచనలుగలవు. కొంత అనుమాన ధోరణి తగ్గించుకొనవలెను. అందువలన కొంత ధైర్యము, శ్రేయస్సును కలుగును.

విద్యార్థులు అధికశ్రమ చేసిననే గాని ఉత్తీర్ణులు కాలేరు. ప్రక్కవారివలనను, స్నేహితులవలనను అప కారమును పొందుదురు. ఇంజనీరింగు, గణితసంబంధిత విద్యార్థులకు కొంత మేలుగావుండును. వైద్య, న్యాయవాద, సైన్స్, వృత్తి, విద్యార్థులకు అత్యధిక శ్రమ అవసరము. ఉద్యోగస్తులకు పై అధికారుల వత్తిడులు తమకంటె క్రిందివారి సహాయము కోరవలసి వచ్చు చుందురు.

సంవత్సరం ఉత్తరార్ధములో అయిష్టబదిలీలు కల్గుచుండును. స్వతంత్రవృత్తులవారికి గతముకంటె మేలు.

వ్యవసాయదారులు పెట్టుబడులు తగ్గించుట మంచిది. భూగృహమార్పులను ఆశించరాదు. సెప్టెంబరు తరువాత కంట్రాక్టర్లకు అనుకూలముగా లేదు.

మత్స్యపరిశ్రమ, కోళ్లఫారములు రైస్‌మిల్లర్లవారు స్వంతపెత్తనములు--పెట్టుబడులు తగ్గించి వ్యాపారము చేయుట మంచిది.

యంత్ర వ్యాపారులకు, చిత్రపరిశ్రమవారికి 6,9,11,3 నెలలు తప్ప-తక్కిన నెలలు బాగుండును. కోర్టు వ్యవహారాలు నిలిచియుండును.

విశాఖవారు పుష్యరాగము ధరించుట, కుజరాహు కేతు జపములు విష్ణు సహస్రపారాయణ, మంగళవార నియమములు చేయుట వలన మనోభీష్టసిద్ధి నొందెదరు.

అనూరాధవారు జాతి నీలము, ముత్యము ధరించుట-గురువార నియమములవలన చిత్త భ్రమ తొలగి దారిద్ర్య నిర్మూలన మగును.

జ్యేష్ఠవారు జాతి పచ్చ కెంపు ధరించుట, విష్ణు-గణేశ్వర పూజలు, రుద్రాభిషేకములవలన పరిస్థితులు అనుకూలించును.

మొత్తముమీద ఈ. రాశివారికి అదృష్టసంఖ్య 9.

వీరికి రాహు కేతులు ప్రతికూలురైననూ, శని గురుబలమువలన వ్యవహారపుటిబ్బందులు తొలగుట, ఆరో గ్యాదిలోపములు కలిగినను-నివారణయగుట, ధైర్యము-కలుగును.

## ధనూరాశి

మూల: 1,2,3,4 పాదములు, పూ.షాడ: 1,2,3,4 పాదములు
ఉ.షాడ: 1వ పాదము.

| | |
|---|---|
| ఆదాయం 2 | వ్యయం 8 |
| రాజపూజ్యం 6 | అవమానం 1 |

ఈ రాశివార్కి అక్టోబరు నెల 30 వరకు, రాహువు జననమందునూ, కేతువు సప్తమందునూ లోహమూర్తులు. తదాదివత్సరాంతం వరకు - రాహువు వ్యయమందునూ, కేతువు షష్ఠమందునూ, సువర్ణమూర్తులు. గురుడు, సెప్టెంబరు 11 వరకును భాగ్యమందు తామ్రమూర్తి. తదుపరి వత్సరాంతము వరకును దశమమున సువర్ణమూర్తి. శని రెండింట తామ్రమూర్తి.

సంవత్సరము ఉత్తరార్ధమునుండి రాహు, కేతు, గురులు పరిపూర్ణయోగప్రదులు. శని వత్సరమంతయును సామాన్యుడు. ఏలినాటి శని చివరిభాగముగుటవలన వీరికి, స్థిర, భూగృహ, కళ్యాణాది శుభాలును-మంచి

యును-దైవకార్యాదులు ఇత్యాది నిర్మాణాదులును, తద్వారా అధిక ధనవ్యయమును అగును. గతముకంటె చాలా మేలు.

సంఘ నాయకత్వములు, పరోపకారబుద్ధి, విద్యా పాండిత్య గోష్ఠి ప్రియత్వము, అలంకార, సన్మానాది లాభములు-భవిష్యత్ గురించిన ఆరాటము మున్నగు లక్షణములను కలిగియుందురు. అట్లే-ముఖసంబంధ అనారోగ్యములు, పుత్ర కళత్రాదుల ఆరోగ్య లోపములు, ఔషధసేవలు, దూరప్రయాణములు కూడా కలుగుచుండును. బద్ధకమును, మాట పిరికితనమును, అతినిద్రను తగ్గించుకొన వలెను. శరీరముఖకవళికలు గతములో కంటే మెరుగుగా యుండును.

సెప్టెంబరు తరువాత ముఖ్యమైన జపశాంతులు కొన్ని చేయించుకొనుటవలన-పుత్ర కళత్ర అనారోగ్యాది లోపములు తొలగి కుటుంబమునందు శాంతి కలుగును.

విద్యార్థులకు సంవత్సర ఉత్తరార్థమునుండి విద్యాసక్తి కలుగును. వైద్యము, ఇంజనీరింగు, న్యాయవాద, తెలుగుభాషా విద్యార్థులకు-అధిక శ్రద్ధ అవసరము. రాహు కేతుల జపశాంతులు, సరస్వతీ పూజ చేయించుకొనుటవలన విద్యా వృద్ధి, అవకాశములు కలుగును.

స్వతంత్రవృత్తులవారికి, వ్యాపారస్తులకు ఇది ప్రోత్సాహకరమైన కాలము.

ఇనుము, తైలము, బొగ్గు, అపరములు, సిమెంటు వ్యాపారులకు నవంబరు తరువాత సామాన్య ఫలితములు వుండును. అపరాలు, కిరాణా, ఫ్యాన్సీ, వస్త్రములు, ధాన్యము వ్యాపారులకు. చిత్ర పరిశ్రమ వారికి, న్యాయవాద, వైద్యవృత్తుల వారికి-మే, జూన్, సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు, ఫిబ్రవరి, మార్చి నెలలందు ఆశించిన ఫలితములు అందగలవు.

లావాదేవీలు ఒకదారికి రాగలవు. నూతనముగా లావాదేవీలు వచ్చే సూచనలు వున్నప్పటికినీ, గురుబలమువలన అవన్నియునూ పరిష్కృతములగును.

మూలానక్షత్రమువారు వైఢూర్య, పుష్యరాగములు ధరించుట శనివార నియమములు, శ్రీ లక్ష్మీ నారాయణులు, మరియు, దత్తాత్రేయుల పూజలు చేయుట మంచిది.

పూర్వాషాడ వారికి వజ్రధారణము, సుందరకాండ పారాయణము, సుబ్రహ్మణ్య ఈశ్వరాభిషేకములు చేయించుకొనుట శ్రేయస్కరము.

ఉత్తరాషాఢవారు కెంపు, ఇంద్రనీలము ధరించుట మంచిది.

ఈ రాశివారికి అదృష్టసంఖ్య 3. ఆదిత్య, శనివార నియమములను, కుజరాహు గ్రహజపములును చేయుటవలన సంవత్సరపూర్వార్ధమున మనోభీష్టములు నెరవేరుటయేగాక, సంవత్సరాంతమునవచ్చు వక్రఫలితములు తొలగును. 1,3,5,6,9 తేదీలు, సంఖ్యలు, ఆది, బుధ, గురు, శుక్రవారములు అనుకూలించును.

## మకరరాశి

ఉత్తరాషాడ: 2,3,4 పాదములు, శ్రవణం: 1,2,3,4 పాదములు
ధనిష్ఠ: 1,2 పాదములు.

| | |
|---|---|
| ఆదాయం 5 | వ్యయం 2 |
| రాజపూజ్యం 2 | అవమానం 4 |

ఈ రాశివార్కి గురుడు సెప్టెంబరు 11 వరకు 8ట రజితమూర్తి. తదాదివత్సరమంతయు 9ట కూడా రజితమూర్తి. శని వత్సరమంతయు జన్మమందు సువర్ణమూర్తి. రాహు 12ట కేతువు 6ట అక్టోబరు 30

వరకు సువర్ణమూర్తులు. పిదప వత్సరాంతము వరకు రాహు 11ట కేతువు 5ట లోహమూర్తులు. వీరికి ఏల్నాటి (జన్మ) శని వున్ననూ, అష్టమగురుని వలన దోషముగా ఉన్నను, రాహువు 12ట వున్ననూ, శని స్వక్షేత్రవర్తియగుటవలననూ-ఇతర గ్రహబలములవలనను వత్సరము అన్ని విధములా భవిష్యత్ గురించి స్థిర బాటలు వేయుట, నెమ్మదిమీద కార్యానుకూలత, అనారోగ్యాది నిర్మూలనములు, పుత్ర పుత్రికాది ఉద్యోగ అభివృద్ధి మరియు దైవకార్య నిర్మాణాదులు ఆచరించుటమున్నగు ఫలితము లుండును.

వీరికి పట్టుదల హెచ్చు. ఇతరులను నమ్మరు. విద్య, అలంకార, నాయకత్వాభిమానులు, మోకాలు, తొడలు ప్రాంతములందు అరోగ్యలోపములు, వాతశ్లేష్మ చర్మరోగములు వెంటాడుచుండును. గౌరవమును గురించి పాటుపడుచుందురు. ప్రతిపనియు శ్రమకరముగను, వృధాప్రయాసలతోను- నెమ్మదిమీద నెరవేరు చుండును.

భాషా శాస్త్ర, ఇంజనీరింగు, గణిత సంబంధిత విద్యార్థులకు పరీక్షాకాలము, వైద్య, న్యాయవాద, చిత్ర, కళాకారులకు గతంకంటె మేలు. ఇంజనీర్లు, వైద్యులు, ఆర్థికశాఖోద్యోగులు, ఇతరోద్యోగులకు 6,11,12,3 మాసములు అనుకూలములు కావు. ఆలస్యంమీద ప్రమోషన్లుకలుగును. నూతనోద్యోగములాశించువారికి ఆలస్యము కలిగిననూ ప్రయత్నములు ఫలించును. దూరప్రాంతములకు వెళ్లగలరు.

యాక్టర్లు, స్వతంత్రవృత్తులవారు, కంట్రాక్టర్లకు మిశ్రమఫలితములు. వ్యవసాయదార్లకు పూర్వసస్య ములు ఫలించును. కోర్టు వ్యవహారములు కలిసివచ్చును. అపరములు, మిర్చి, పుగాకు, కిరాణా వ్యాపారులకు పూర్వార్థము మేలు. నూతన వ్యాపారములను ఆశించరాదు. వస్త్ర, యాంత్రిక, రసాయనిక, ధాన్యం వ్యాపారులు మున్నగువారికి 6,7,8,11,12,3 నెలలుకాక, మిగిలిన నెలలందు ఆశించిన ఫలితములు కలు గును. మత్స్యములు, కోళ్ళఫారములవారికి, సినీవ్యాపారులకు, రాజకీయవాదులకు అనుకూలకాలము. ఇంకనూ అభివృద్ధి కలుగును.

ఉత్తరాషాడవారు కెంపు ధరించుట, సూర్య, శనైశ్చరారాధనలు, శని గురుజపశాంతులు, గురువార నియమములు చేయుట మంచిది.

శ్రవణంవారు నిదానించుట మేలు. ముత్యం, నీలం ధరించుట, సోమవార నియమములవలన మనస్తాప ములు తొలగును.

ధనిష్ఠవారు పగడం ధరించుట, శనివారనియమములు, రుద్రాభిషేకములు చేయుటవలననూ- ఉద్యోగ వివాహాది ఫలితములు కలుగును.

ఈ రాశి వారికి అదృష్ట సంఖ్య 8.

నవగ్రహ జపశాంతులు, రుద్రాభిషేకములు, గురువారనియమములు, శివలింగదర్శనము, అన్నశాంతి చేయుటవలన-4,7,8,10,1,2 మాసములలో సూచీభూతములుగానున్న దుస్స్వప్నాది దుష్టదోషసూచనలు తొలగుటయేగాక-మంచి భవిష్యత్ కలుగును. వ్యవహారాది జయములు, వ్యాపారాదిలాభములును జయముగా కనిపించిననూ-నిలబాటుగానుండును. భూ, గృహ, శుభకార్యాది యత్నకార్యములు సం||ర పూర్వార్ధమునం దనుకూలించును. సంఘమునందు పెత్తనము వహించరాదు. రుద్రాభిషేకము, శనైశ్చర తైలాభిషేకము మహామృత్యుంజయ జపశాంతులు, ఆదిత్యాది నవగ్రహజపశాంతులు గురువారనియమములు పాటించుటవలన అనారోగ్యములు, వృధా ధనవ్యయములు, దోషపీడలు నివారణమగును.

స్త్రీలు గురు, శుక్రవార నియమములు భ్రమరాంబ, చంద్రశేఖరస్తోత్రములు సూర్యనమస్కారములు చేయుట-నీలపుష్యరాగం ధరించుటవలన-గర్భిణులకు సుఖప్రసవము- సంతాన ఆరోగ్య సౌఖ్యములు-భర్తృవ్యాపా రారోగ్యాది లాభములును కలుగును.

# కుంభరాశి

ధనిష్ఠ: 3,4 పాదములు, శతభిషం: 1,2,3,4 పాదములు
పూర్వాభాద్ర: 1,2,3 పాదములు.

ఆదాయం 5 | వ్యయం 2
రాజపూజ్యం 5 | అవమానం 4

ఈ రాశివారికి అక్టోబరు 30వరకు రాహువు లాభమందు, కేతువు 5ట రజితమూర్తులు. తదాది వత్సరాంతంవరకు రాహు 10ట, కేతువు 4ట సువర్ణమూర్తులు. గురుడు సెప్టెంబరు 11 వరకు 6ట లోహమూర్తి. తదాది 7ట సువర్ణమూర్తి. శని వత్సరమంతయు 12ట తామ్రమూర్తి.

వీరికి అక్టోబరునుండి గురు రాహుల బలమువలన గతంకంటె మేలు. వీరికి పట్టుదల హెచ్చు. సం|| రమంతయు మిశ్రమఫలితముండును, ఏలినాటిశనివలననూ, సం||ర ఉత్తరార్ధమున 4ట కేతువు వలనను-ఛీ ఛీగను-వ్యయప్రయాసలతో నుందురు.

వాహనములభయము-అకాలభోజనము-నేత్రపీడ-మేనమామ వర్గమురీత్యా అపవాదములు-- మ్లేచ్ఛుల వలన గౌరవములు, సంఘములో పరోక్ష కార్యనిర్వహణ-ఇత్యాది లక్షణములు కలుగుచుండును. ఏది యేమైననూ సం||ర పూర్వార్ధమున గురుబలముచే గతముకంటె గౌరవముగానే నడచును. జాయింటు వ్యాపారము లలో నిదానించుట మేలు. కంఠము, తొడలు, మోకాలు మున్నగు అవయవములందు రోగసూచనలువున్నను, ఔషధసేవ, శస్త్రచికిత్సల ద్వారా ధనవ్యయము వలన క్షేమముగా నుందురు.

మొత్తముమీద దైవభక్తి కలిగి యుందురు. వ్యాపారస్థులకు సం||ర పూర్వార్ధము మేలు. ఉద్యోగ స్థులకు స్థానచలన నిలకడ, అధికారభీతి, కొద్దిమందికి ఉద్యోగ వ్యయములు సూచింపబడుచున్నవి. ఇతరులను నమ్మరాదు. ఉద్యోగస్తులు, స్వతంత్రవృత్తులవారు-శనికి తైలాభిషేకము రుద్రాభిషేకము. కొన్ని ఉపశాం తులు చేయించుకొనుటచే మనఃస్థిమితము, ఉద్యోగ స్థిరత్వము కలుగును. నూతనోద్యోగములు, ప్రమోషనులు నిలచియుండును. కంట్రాక్టర్లకు శ్రమ మిగులును. వ్యవసాయదారులకు రెండవపంట ఫలించును.

రాజకీయములు స్పెక్యులేషనులు అనుకూలములు కావు. ఇనుము, తైలము, అపరములు, బంగారాది లోహ వ్యాపారులకు 5,8,9,10,1,2 మాసములు అనుకూలములు కావు. కలప, పుగాకు, మిర్చి, కిరాణా, ఫ్యాన్సీ వ్యాపారులకు నవంబరు తరువాత వ్యాపారములందు మార్పు, చేర్పులుండును. వస్త్ర, యాంత్రిక, రసాయనిక వ్యాపారులకు 7,8,9,11 నెలలు తప్ప, తక్కిన నెలలో ఇంకనూ వ్యాపారవృద్ధి కలుగును. వైద్య, న్యాయవాదులకు-సినీతారలకు మధ్యమఫలితము. చేపలు కోళ్ళఫారముల వారికి 6,7,9,1 నెలలుగాక ఇతర నెలలో ఆశించిన ఫలితములు కలుగును.

ధనిష్ఠానక్షత్రం వారికి పగడము, వజ్రమూ ధరించుట-లక్ష్మీ గణేశ భగలాముఖీ మాతంగీ పూజలు జరిపిం చుట-శనివార నియమములు యోగించును.

శతతారవారు గోమేధికము, పగడమూ, ధరించుట-దత్తాత్రేయ శ్రీకృష్ణ జపములు-శనీశ్వర రాహు కేతు జపములు చేయించుట మంచిది. తైలాభిషేకము ప్రధానము.

పూ||భాద్రవారు పుష్యరాగమాణిక్యములు ధరించుట. సాయి శ్రీకృష్ణ పూజలు-గురువార నియమ ములవలన శాంతి, వ్యవహారలాభములు కలుగును.

ఈ రాశి వారికి అదృష్ట సంఖ్య 8.

